# ఆంధ్రపత్రిక

316916




The Andhra Patrika, Madras, } Regd No 1118, Vol, 34 No 144 THURSDAY 18th SEPTEMBER 1947 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao


# "పాకిస్థాన్ అక్రమమార్గాన్నే అనుసరిస్తే యుద్ధం అనివార్యమే"

## ఉభయవర్గాలవారు ఉన్మత్తులైనట్లు ఉన్నదని గాంధిజీ ఆవేదన

### ఇళ్లువిడిచివెళ్లవద్దని హిందువులకు, సిక్కులకు, ముస్లింలకు ఆయాప్రభుత్వాలు ఎందుకు నచ్చచెప్పవని ప్రశ్న

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16: "పాకిస్థాన్ అక్రమమార్గాన్నే అవలంబించేట్లయితే ఇండియా పాకిస్థానులకు యుద్ధం తప్పదు. నేననుకున్నట్లు చెయ్యడానికి వీలే ఉంటే మిలిటరీ కాదు సరికదా, పోలీసులను కూడా ఉంచుకోను. కాని ఇదంతా వ్యర్థప్రసంగం. నేను ప్రభుత్వాన్ని కాను గదా! 'మిమ్మల్ని మేము అన్నివిధాలా రక్షిస్తాము. మీరు మీ ఇళ్లను విడిచి వెళ్లకండి' అని పాకిస్థాన్ ప్రభుత్వం అక్కడి హిందూ సిక్కులతో చెప్పి వారిని అక్కడ ఉంచే ప్రయత్నం ఎందుకు చెయ్యలేదు? ఇక్కడ ఇండియాలో మీరంతా ప్రతి ముసల్మానుకూ రక్షణ ఉంటుందని ఎందుకు విశ్వాసం కలిగించలేకపోయారు? ఈనాడు ఉభయపక్షాలవారికీ పిచ్చెక్కినట్లు కనిపిస్తోంది. దీనికంతకూ సర్వనాశనమే ఫలితమవుతుంది," అని మహాత్మాగాంధీ ఢిల్లీ మాలపల్లి (భంగీకాలనీ) లో నేటి ఉదయం సమావేశమయిన 500 మంది రాష్ట్రీయ స్వయంసేవకుల నుద్దేశించి ఉపన్యసిస్తూ హెచ్చరించారు.

తర్వాత గాంధిజీ స్వయంసేవక సంఘ నిర్మాతలు శ్రీ హెడ్గెవారు సజీవులై ఉండగా ఒక మాటు చాలాఏళ్ల క్రితం సంఘ శిబిరం చూచామనీ, అప్పుడు క్రమశిక్షణ, అస్పృశ్యతా రాహిత్యం, సంపూర్ణ నిరాడంబరత్వం, చక్కని క్రమశిక్షణం ఉండడం వల్ల ఈ సంఘం అప్పుడు తమ్మ ఆకర్షించిందని చెపుతూ ఇల్లా అన్నారు.

"అప్పటినుంచీ ఈ సంఘం అభివృద్ధి పొందుతూనే ఉన్నది. ఆత్మత్యాగ సేవాదీక్షలు ఆదర్శంగా గల ఏ సంస్థ అయినా అభివృద్ధి పొంది తీరుతుంది. కాని నిజంగా లోకోపకారకం కావాలంటే స్వార్థత్యాగంతోపాటు లక్ష్యశుద్ధి యథార్థజ్ఞానమూ ఉండాలి. ఇవి రెండూ లేని త్యాగబుద్ధి సంఘ వినాశనానికే దారి తీస్తుంది."

ప్రార్థన గేయాన్ని ఆధారంగా తీసుకుని హిందూమతాన్ని గూర్చి గాంధిజీ ఇల్లా అన్నారు.

"ఈ పాట భారత మాతృభూమినీ, హిందూమత సంస్కారాలనూ ప్రశంసిస్తోంది. నేను శుద్ధ సనాతన హిందువునని నా నమ్మకం. 'సనాతన' అంటే నేను వ్యుత్పత్త్యర్థాన్నే గ్రహిస్తున్నాను. హిందూ శబ్దం ఎట్లా వచ్చిందో ఎవ్వరికీ తెలియదు. ఎవరో మనకీ పేరు పెట్టారు. మన ప్రవర్తన కనుగుణంగా మనమూ దాన్ని ధరించాము. ప్రపంచంలో అన్ని మతాల సారాన్నీ హిందూమతం తనలో లీనం చేసుకుంది. ఈ దృష్టితో చూస్తే ఇది ఒక ప్రత్యేక మతం కాదు. అందుచేత దురదృష్టవశాత్తూ ఈనాడు దాపురించినట్లుగా ఇస్లాంతో గాని మరే మతంతో గాని దీనికి విరోధం అంటూ ఉండడానికి వీల్లేదు.

హిందూ మతంలో అస్పృశ్యతా మహావిషం ఏనాడు ప్రవేశించిందో అప్పటినుంచే దీనికి అధఃపతనం ప్రారంభ

(5-వ పేజీ చూడుడు)

## పంజాబు ఉభయ పార్శ్వాలకు

### పదిలక్షల కాందిశీకుల నిర్గమనం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16. పశ్చిమ పంజాబునుంచి ప్రాచ్యపంజాబుకున్నూ, ప్రాచ్య పంజాబునుంచి పశ్చిమపంజాబుకున్నూ పది లక్షలమంది కాందిశీకులు మిలిటరీ రక్షణతో వారమురోజులలో పోయినట్లుగా అమృతసర్ మిలిటరీవారు తెలియచేస్తున్నారు. ఎక్కువమంది కాలినడకను వెళ్లినారు. 3 లక్షలమంది రైలుబండ్లలోనూ ఒక లక్షమంది మోటారుబండ్లలోనూ కొద్దివందలమంది విమానాలలోనూ పోయినారు.

కాలినడకను పడమటి పంజాబునుంచి సెప్టెంబరు 1 వ తేదీన కాందిశీకుల సమూహం తూర్పు పంజాబుకు బయలుదేరింది. ఆ కాందిశీకులు నాల్గులక్షలమంది. వారు గోశ్రా ప్రాంతాలనుంచి బయలుదేరి సుమందరి, గుజరన్‌వాలా, బల్లోకి పట్టణాల మీదుగాపోయి ఫిరోజ్‌పూరు చేరినారు. పడమటి పంజాబునుంచి రైలుబండ్లమీద 1,15092 మంది వచ్చినారు. మోటారు బండ్లమీద 51,940 మంది వచ్చినారు. కొద్దివందలమంది విమానాలలో వచ్చినారు.

తూర్పు పంజాబునుంచి మిలిటరీ రక్షణముతో అమృతసరునుంచి కాలినడకను బయలుదేరిన కాందిశీకులు రెండులక్షలమంది గ్రాండ్ ట్రంకురోడ్డు మీదుగా లాహోరు చేరినారు. మిలిటరీ రక్షణముతో తూర్పు పంజాబునుంచి రైలుబండ్లమీద 14,6909 మందిన్నీ మోటారుబండ్లమీద 45,000 మందినిన్నీ పంపినారు. మిగతావారు ఆయా సంస్థల సహాయముతో వెళ్ల గలిగినారు.

ఇప్పుడు ఇంకా చాలామంది కాందిశీకులు షేక్పూరా, లీలాపూర్, ముల్తాన్, ఝంగ్, మాంట్‌గమరీ, ముజఫర్‌ఘర్, సర్గోధా, లాహోరు, రావల్‌పిండి, జీలం, గుజరాత్, సియల్కోట్, గుజరన్‌వాలా, పట్టణాలలోనూ ఆయా పల్లెపట్టులలోనూ ఉన్నారు.

## 1948 జనవరి ఆఖరులోగా స్వతంత్ర బర్మా రిపబ్లిక్

రంగూన్, సెప్టెంబరు 16: 1948 జనవరి 31 తేదీలోపుగా బర్మా సర్వస్వతంత్ర ప్రజాస్వామ్య రాజ్యం కాగలదనీ, అంతకంటె ఎక్కువ వ్యవధి పట్టదనీ బర్మా ప్రభుత్వ విదేశీ వ్యవహారాల సలహాదారు యూ క్యాన్ ఒక ప్రకటన ద్వారా తెలియజేస్తున్నారు. ఫాసిస్టు ప్రతికూల ప్రజాస్వాతంత్ర్య సమితి రంగూన్ శాఖకు అధ్యక్షుడు.



## మౌంట్‌బాటెన్‌తో మహాత్ముని గోష్ఠి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16: నేటిమధ్యాహ్నము గాంధిమహాత్ముడు గవర్నరు జనరలు లార్డు మౌంట్‌బాటనును ప్రభుత్వ భవనములో సందర్శించి ఆయనతో ఒక గంటసేపు మాటలాడెను.

### నాయకుల చర్చ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16: నేటిసాయంకాలము ఉపప్రధాని సర్దార్ పటేలుగారు గాంధిమహాత్ముని సందర్శించి దాదాపు ఒక గంటసేపు ఆయనతో మాట్లాడెను. అనంతరము ప్రధాని పండిత నెహ్రూగారును, ఆరోగ్యశాఖామంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృతకౌరుగారును గాంధి మహాత్ముని చూడవచ్చిరి.

రాష్ట్రపతి భార్య శ్రీమతి సుచేతా కృపాలనీ గారును, సోషలిస్టు నాయకుడగు డా॥ రామమనోహర్ లోహియాగారును నేటి సాయంకాలము మహాత్మునితో కొంతకాలము సంభాషించిరి. — అ. ప్రె.

## "పాకిస్థాన్‌పై మాకు ఏవిధమైన శత్రుభావం లేదు"

### లియాకత్ ఆలీ ఆరోపణలకు భారతప్రధాని నెహ్రూ సమాధానం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16: "పాకిస్థానును శత్రుదేశంగా గణించాలని మాలో ఎవ్వరమూ భావించలేదు. దాన్ని నాశనం చెయ్యాలన్న ఉద్దేశం మాకసలే లేదు. ఇండియా ప్రభుత్వానికి అలాంటి ఉద్దేశం ఉన్నట్లు ఆరోపించడం చాలా దురదృష్టం" అని ఇండియా ప్రధాని పండిట్ నెహ్రూ, సెప్టెంబరు 14 వ తేదీన పంజాబు ముస్లింలీగు కౌన్సిలులో పాకిస్థాన్ ప్రధాని లియాకత్ అలీఖాన్ బాధ్యతారహితంగా ఇండియా ప్రభుత్వంపై అసత్యారోపణలు చేస్తూ వెల్లడించిన ప్రకటనను ఖండిస్తూ ఉద్ఘాటించాడు.

ఈసందర్భంలో పండిట్ నెహ్రూ ఇల్లా అన్నారు.

"పాకిస్థాన్ ప్రధాని లియాకత్ అలీఖాన్ లాహోరులో సెప్టెంబరు 14 తేదీన పంజాబ్ ముస్లింలీగ్ కౌన్సిలు సమావేశంలో చేసిన ప్రకటన ఒకటి నాకళ్ల బడింది. ఆ ప్రకటనలో ఆయన ఇల్లా అన్నట్లు వార్తాపత్రికలు ప్రకటించాయి.

"(1) ఈనాడు మన్ని (పాకిస్థానును) సర్వవిధాలా నాశనం చెయ్యదలచుకున్న దుష్టశక్తులు మనచుట్టూ మూగి ఉన్నాయి. ఆశక్తులన్నీ పాకిస్థాన్ దృఢపడడంతో యావద్భారత భూఖండాన్నీ ఏకచ్ఛత్రంగా పాలించాలన్న తమ చిరకాలస్వప్నం ఫలించదేమోనని భావిస్తున్నాయి.

(2) శాంతిభద్రతల సంరక్షణకు ఉపయోగింపబడవలసిన కత్తులూ, తుపాకులూ తూర్పు పంజాబు ముస్లిములను తరిమివెయ్యడానికి ఉపయోగింపబడ్డాయి.

(3) కొన్నాళ్ల క్రితం లాహోరులో ఉభయాధినివేశ ప్రభుత్వాలూ సంయుక్తంగా నిశ్చయించుకొన్న నిర్ణయాలను ఇండియా ప్రభుత్వంగాని తూర్పు పంజాబు ప్రభుత్వంగాని గౌరవించి ఆచరణలో పెట్టటంలేదు."

వెనుక చేసుకున్న నిర్ణయాలను ఇతోధిక శక్తిరంతంగా ఆచరణలో పెట్టడానికీ ఇప్పటి విషాద కల్లోల పరిస్థితిని ఎక్కడికక్కడ స్థానికంచేసి సాంతంగా నిర్మూలించడానికీ ఏయే మార్గాలు అవలంబించాలో ఆలోచించడం కోసం ఇండియా పాకిస్థాన్ ప్రభుత్వాల ప్రతినిధులు ఏ రోజున లాహోరులో సమావేశమయ్యారో ఆ రోజున ఈ ప్రకటన రావడంవల్ల నాకు చాలా ఆశ్చర్యమూ కలిగింది, ఎంతో బాధ కలిగింది. దేశవిభజన జరగకముందు ఎల్లాగైనా దాన్ని నివారించాలని మాలో చాలామంది హృదయపూర్వకంగా కృషిచేసిన సంగతి జగత్ప్రసిద్ధమైన విషయం. కాని విభజన కు నిర్ణయించుకున్న

5 వ పేజీ చూడుడు

## ఇండియాపై ఐక్యరాజ్యసమితిలో పాకిస్థాన్ ఫిర్యాదు చేయవచ్చునట

### సర్ జఫ్రుల్లాఖాన్ బెదరింపు

న్యూయార్కు, సెప్టెంబరు 16: "ముస్లిం ప్రజలపై జరుగుతున్న హత్యలను మాన్పించుటకు ఇండియా ప్రభుత్వం వెంటనే చర్య తీసికొనకపోయినచో" ఈ విషయమై ఐక్యరాజ్య సమితికి పాకిస్థాన్ ఫిర్యాదు చేయగలదని ఐక్యరాజ్య సమితికి పాకిస్థాన్ ప్రతినిధి వర్గనాయకుడు సర్ జఫ్రుల్లాఖాన్ లండన్‌నుండి విమానంలో దిగగానే పత్రికా విలేఖరుల సభలో ప్రకటించాడు.

"ఐక్యరాజ్య సమితి చర్యలవలన సంతృప్తి కలుగకపోయినచో పాకిస్థాన్ ప్రభుత్వం ప్రత్యక్షచర్యలకు పూనుకుని తీరును" అని ఆయన చెప్పెను. మతకల్లోలములను నివారించుటకు ఇండియా ప్రభుత్వం ఏమీ చేయటంలేదని ఈయన నిందించాడు.

ఐక్యరాజ్య సమితికి ఫిర్యాదు చేయుమని తన ప్రభుత్వం తనను ఆదేశించలేదు గాని ఏ క్షణంలోనైనా ఆ ఆవశ్యకత వచ్చుటకు అవకాశం ఉన్నదనీ, పరిస్థితి ప్రపంచశాంతిభంగం కలిగించేటంత విషమంగా ఉందనీ చెపుతూ "సావధానముగా ఆలోచించి, నిర్ణయించిన ప్రకారం ప్రకారముగా" జరుగుతున్న ఈ హత్యలను అరికట్టకపోతే, పాకిస్థాన్, ఐక్యరాజ్య సమితికి ఫిర్యాదు చేసీ, ఫలితములు సంతృప్తికరంగా లేకపోతే ప్రత్యక్ష చర్యలకు పూనుకొనక గత్యంతరంలేదని ఈయన చెప్పాడు. తూర్పు పంజాబు రాష్ట్రంలో నెలనుండి జరుగుతున్న ఈ హత్యలు ఇప్పుడు ఢిల్లీ రాష్ట్రమునకు కూడ పాకిపోయినవనీ, వీనివలన పాకిస్థాన్ ప్రతినిధివర్గం విచారంతోనూ, విభ్రాంతితోనూ కృంగిపోతున్నదని చెపుతూ "మా యిండ్లలో మాకుటుంబములకు, సోదరులకు ఏక్షణంలో ప్రమాదం సంభవిస్తుందోనని మేము భయభ్రాంతులంగా ఉండటం సహజమే కదా. దీనికంతకూ బాధ్యత ఇండియా ప్రభుత్వానిదే. ఆ ప్రభుత్వం తన బాధ్యతను నిర్వహించుటయేకాదు, యింతవరకు, గుర్తించనైలేదు. ఇంతవరకు ఆ ప్రభుత్వం చేసిందల్లా ప్రజలకు విజ్ఞప్తి చేయటమే. కాని క్రోధపూరితులై ఉన్న ముస్లిమేతర ప్రజలు ఈ విజ్ఞప్తులను పాటిస్తారని భావించరాదు. పైగా, ప్రభుత్వపు పోలీసులే ప్రజలకు తోడ్పడుతూ ముస్లింల హత్యలకు సహాయం చేస్తున్నారు" అని ఆయన అన్నాడు.

## భారతదేశంపై పాకిస్థాన్ అప్రకటిత యుద్ధం సాగిస్తున్నది

### పరిస్థితి నెదుర్కొనుటకు మంత్రివర్గపునర్నిర్మాణం

### ఢిల్లీ, పంజాబ్ సంఘటనలపై అధికారవర్గాలఅభిప్రాయం

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16: కేంద్ర ప్రభుత్వ పునర్నిర్మాణము అనివార్యమగుచున్నది. ఢిల్లీలో ముసల్మానులవద్ద ఆధునిక ఆయుధాలు పుష్కలంగా ఉన్నట్లు ఇటీవల జరిగిన సోదాలవల్ల బయటపడినది. సైనికుల నెదిరించి యుంచుమించు కొద్దిపాటియుద్ధమును సాగించియుండిరి. భవిష్యత్తులో భారతదేశ శాంతిని కాపాడుటెట్లు అన్నదొక క్లిష్టసమస్యగ పరిణమించినది.

పాకిస్తాన్, భారతదేశముపై అప్రకటిత యుద్ధమును కొనసాగించుచున్నట్లె కొందరు భావించుచున్నారు. పంజాబు సంక్షోభములో మరణించిన వారి సంఖ్యను గురించి పాకిస్థాన్ మంత్రి గజ్నఫరలీఖాన్ గారు తెలిపిన లెక్కలు వాస్తవానికి చాలా దూరముగ నున్నవి. అవి ఏ విధముగ చూచినను సరియైన లెక్కలు కావని, పాకిస్థాన్‌లో చిత్రవధ నధికము చేయ ప్రోత్సహించుచున్నవని ఇక్కడ అధికారవర్గమువారు భావించుచున్నారు. పాకిస్థాన్ రేడియో ప్రతినిత్యము చేయుచున్న బ్రాడ్‌కాస్టులు పాకిస్థాన్‌లోని పత్రికలు ప్రచురించుచున్న వ్యాసములు ముస్లింలను దౌర్జన్యమునకే పురికొల్పుచున్నవి. యీ ప్రచారముల అంశములకు, పత్రికా వ్యాసములకు ఒక హద్దు వున్నట్లు కనిపించుటలేదు.

భారతదేశముపై దండయాత్ర సాగించుటకు పాకిస్థాన్ విపుల సన్నాహములు చేయుచున్నట్లు ఇదివరకే వార్తలు వచ్చుచున్నవి. ఏ క్షణంలో నయినా ఉభయ అధినివేశముల మధ్య యుద్ధము ప్రారంభం కాగలిగినంత ప్రమాదముగనున్నవి పరిస్థితులు. ఈ పరిస్థితుల నెదుర్కొనుటకు కేంద్రప్రభుత్వ పునర్నిర్మాణము తప్పనిసరి యగుచున్నది. ప్రస్తుత మంత్రివర్గ వ్యవహారములు పొందికగా, ఒకే ధోరణిలో జరుగుటలేదు. సమైక్యత లేనందువల్ల ప్రధానమైన విషయములపై నిర్ణయములు చేయుట సాధ్యముగా నున్నది. బట్ట, తిండి కొరత కొన్ని ఎదుర్కొనడానికి కేంద్రప్రభుత్వం గత 12 మాసాలలో తీసుకొన్నట్టి చర్యలేమంత ప్రయోజనకరముగ లేవు.

కేంద్రప్రభుత్వ పునర్నిర్మాణము జరుగు పక్షములో శాఖల పునః పంపకం జరుగుటే గాక మంత్రులలోను కొన్నిమార్పులు జరుగవచ్చునని అభిజ్ఞవర్గములవల్ల తెలియుచున్నది. మంత్రివర్గ పునర్నిర్మాణ విషయములో గాంధిజీ అభిప్రాయమునుకూడ తెలుసుకొందురని ఇచట భావించుచున్నారు." మీకు శాంతి కావలెనన్న సమరాయత్తం కండి" అన్నది నేటినినాదము కానున్నట్లు గోచరించుచున్నది.

## నవంబరులో ఇండియా ప్రభుత్వ తాత్కాలిక బడ్జెట్ ప్రతిపాదన

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 16: నవంబరు మధ్యభాగములో జరుగనున్న భారత అధినివేశ శాసనసభ ప్రథమ సమావేశములో ఆర్థిక సభ్యుడు శ్రీ షణ్ముఖం చెట్టిగారు 1947 సం॥ ఆగస్టు 15 తేదీ నుండి ప్రస్తుత ఆర్థిక సంవత్సరాంతము వరకు కావలసిన ఖర్చులకుగాను ఒక తాత్కాలిక బడ్జెటును ప్రవేశపెట్టునని తెలియుచున్నది.

ఆగస్టు 15 తేదీన రెండు అధినివేశములు ఏర్పడుటవల్లను, ఈ రెండు అధినివేశముల స్థాపనవల్ల ఆర్థిక స్థితిగతులు సంపూర్ణముగా మారుటవల్లను ఈ బడ్జెటు అవసరమయ్యెనని తెలియుచున్నది. ఐనప్పటికి నవంబరు సమావేశములో పన్నులలో మార్పు లేమియు ప్రకటింపబడవని అనుకొనుచున్నారు.

1947 సం॥ భారత స్వాతంత్ర్య చట్టము

5 వ పేజి చూడుడు

## ఐక్యరాజ్య సమితి ద్వితీయ సమావేశం

### అధ్యక్షస్థానానికి బ్రెజిల్ ప్రతినిధి ఎన్నిక

ఫ్లషింగ్ మెడోస్ (న్యూయార్కు), సెప్టెంబరు 16: ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశానికి బ్రెజిల్ సీనియర్ ప్రతినిధి ఆస్వాల్డో అరనహాను అధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు. ఇతడు ఒకప్పుడు బ్రెజిల్‌కు విదేశశాఖామంత్రిగా పని చేశాడు. అమెరికా బ్రెజిలులమధ్య సహకార విధానాన్ని ఇతడు బలపరిచాడు. ఆ విధానం ఫలితంగానే బ్రెజిల్ 1942 లో అక్షరాజ్యాలపై యుద్ధానికి దిగింది.

అరనహా వయస్సు 53 సంవత్సరాలు. 1930 లో బ్రెజిలులో అంతర్యుద్ధం వచ్చినపుడు ఇతడు తుపాకి గుండుదెబ్బకు గురి అయినాడు. ఆ తుపాకి గుండు ఇప్పటికీ ఇతడి శరీరంలోనే ఉన్నది. దాన్ని తీసివేయించలేదు. మూడు సంవత్సరాలపాటు అమెరికాలో బ్రెజిల్ రాయబారిగాకూడా పనిచేశాడు.

లెబనాన్ ప్రతినిధి అయిన చార్లిస్ మాలిక్‌ను దక్షిణాఫ్రికా 'జనరల్ కమిటీ' అధ్యక్షస్థానానికి ప్రతిపాదించింది. శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ ఇదే స్థానానికి సిరియా ప్రతినిధి ఎల్‌ఖౌరీ పేరు ప్రతిపాదించింది. చార్లెస్ మాలిక్ తన పేరును ఉపసంహరించుకొన్నాడు. ఖౌరీని అధ్యక్షుడుగా యెన్నుకున్నారు. రాజకీయ సంఘానికి జోసెఫ్ బీచ్‌ని (లక్జెంబర్గు) అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. ఇతడిపేరును బ్రిటిషు ప్రతినిధి ప్రతిపాదించారు.

ఎకనమిక్ ఫైనాన్షియల్ కమిటీకి సేవార్ గెర్నాన్ శాంటాక్రజ్‌ను (ఛైల్) మానవ విజ్ఞానిక క్షేమసంఘానికి డాక్టర్ ఆస్కార్ లాంగ్‌ను (పోలెండు) ధర్మకర్తృత్వ సంఘానికి సర్ కారల్ బెరెండ్సెన్‌ను (న్యూజీలెండు) సహపాలక, బడ్జెటు కమిటీకి జస్టిస్ ఫజ్లీఅలీం అధ్యక్షులుగా ఎన్నుకున్నారు.

## ఢిల్లీకి సురవర్ది ప్రయాణం

కలకత్తా, సెప్టెంబరు 17: మహాత్ముడు ఢిల్లీలో సాగిస్తున్న శాంతిస్థాపన కార్యక్రమంలో సహాయపడే నిమిత్తం బెంగాల్ మాజీ ప్రధాని సురవర్ది రేపు భారత రాజధానికి ప్రయాణమవుతున్నాడు. ఈ పని మీద వీరు ఢిల్లీలో కొంతకాలంపాటు వుండవచ్చు.

## ప్రకటన

గురువారము 18 వ తేదీ వినాయక చతుర్థి పండుగ కార్యాలయము మునకు సెలవు. ఆ కారణముగా శుక్రవారం 19 వ తేదీ పత్రిక ఉండదు.

మేనేజరు,
ఆంధ్రపత్రిక

## గంటల పంచాంగం

సర్వజిత్ నం॥ భాద్రపద శు॥ చవితి 1947 సం॥ సెప్టెం॥ 18 గురువారం శు॥ చవితి సా 6 57 స్వా సా7-31 వర్జ్యం రా 1-21 ల 8-1 వ. వినాయకచతుర్థి.

శు॥ పంచమి సెప్టెం॥ 19 శుక్రవారం శు॥ పంచమి సా7-15 విశా రా 8-31 వర్జ్యం రా 12-45 ల 2-32 వ.

# ఆంధ్రపత్రిక

సర్వజిత్ సం॥ భాద్రపద శు॥ చవితి
గురువారము

## లీగు ప్రముఖుల ప్రచారము

పాకిస్తాను ముస్లిము లీగునాయకులు తమ అసత్యప్రచారమువలన సాధించదలచినది ఏమైననూ, భారత, పాకిస్థాన్ ప్రజల నడుమ సామరస్యము కలుగుటకు ఏమాత్రము ఉపకరింపదు. దేశవిభజనకు పూర్వము ఏ పద్ధతిని అనుసరించిరో ఈ నాడుకూడ అదేఘోరణిని అవలంబించుచున్నారు. వారి వైఖరి గమనించిన అత్యవసరమైన శాంతిస్థాపనకు వారేమాత్రము ఆతురత పడుచున్నట్లులేదు. పాకిస్థాన్‌లో ముస్లిమేతరులు శాంతియుతముగ జీవించవచ్చుననుదానికి ప్రోత్సాహ మిచ్చుటలేదు. వారి యుపన్యాసములు పైకి ఉదారముగ కనుపడినప్పటికిని గూఢముగ నున్న భావము వేరు. కాకపోయిన సర్ జఫరుల్లాఖాన్ బెదరింపులకు గాని, పాకిస్థాన్ ప్రధాని లాహోరులో ఇచ్చిన ఉపన్యాసమునకుగాని, దుండగులను అణచు విషయమున జిన్నాగారు భారత ప్రభుత్వమునకిచ్చిన సలహాకు అర్థము లేదు. గవర్నరు జనరలుగనుండి మరొక ప్రభుత్వమును ప్రత్యక్షముగా నిందించకూడదను ఔచిత్యమును కూడ ఆయన పాటించలేదు.

పైని వ్యాఖ్యానము సమర్థనీయము కాకపోయిన, ఇక పాకిస్థాన్ లీగు నాయకుల అంతర్యము ఒకటైయుండవలెను. తాము సృష్టించిన పాకిస్థాన్ దుష్ఫలితములకు భయపడి, దానికి నిందను ఇతరులమీద వేయ పూనుకొనిరి. లేనియెడల నేడు సర్ జఫరుల్లాగారు "ముస్లిములను హత్యచేయుట నిలుపుదల చేయకపోయిన ఐక్యరాజ్య సమితికి ఫిర్యాదు చేయవలసివచ్చు"ననుటలో అర్థములేదు. ముందు తాము ఎలుగెత్తి కేకలు వేసిన ప్రపంచము తమ మాటలను నమ్మి మోసపోవునని వారు తలచినట్లున్నది. ఉభయ అధినివేశ ప్రధానులు ఉభయ పంజాబులు పర్యటన చేసినపుడు వారి వెంట వెళ్లిన విదేశ పత్రికా విలేఖరులు తెలియజేసిన సంఘటనలనుబట్టి ఎవరు అన్యాయ మార్గమును అనుసరించిరో ప్రపంచమునకు తెలియక పోయినదా? "తృప్తికరముగా పరిష్కరించవల [illegible] ప్రత్యక్ష చర్యకు దిగవలసియుండును" అని సర్ జఫరుల్లాగారు బెదరించిరి. ఈ విధముగ అనుటలో వారి భావమేమో తెలియదుగాని, ప్రత్యక్షచర్యకు దిగిన భారత ప్రభుత్వమునకు పని తేలికయగును. ఇంతవరకు పశ్చిమపంజాబులో ముస్లిము గుండాల చర్యలకు, ప్రభుత్వమునకు సంబంధము లేదను నమ్మకముతో భారత ప్రభుత్వము వ్యవహరించినది.

ప్రధాని పండిత నెహ్రూ చెప్పినట్లు, లియాఖతాలీఖాన్ పంజాబు ముస్లిములీగు కౌన్సిలు కిచ్చిన ఉపన్యాసము ఆశ్చర్యమును కలుగ చేయకమానదు. పాకిస్థాన్ ప్రధాని ఉపన్యాసము కేవలము నిరాధారమైన నిందలతోనూ, అసత్యములతోనూ నిండియున్నది. ఉభయ ప్రభుత్వ ప్రతినిధులు సమావేశమై ప్రస్తుత విషాద పరిస్థితిని తొలగించి, అంతమునరించుటకు మార్గోపాయములను నిర్ణయించిన నాడే, లియాఖతాలీ ఖాన్‌గారు, పండిత నెహ్రూ పేర్కొనిన నిందలను భారత ప్రభుత్వముపై వేయుట ఎంత విరుద్ధమైన విషయమో వేరుగ చెప్పనవసరము లేదు. పండిత నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేల్ తదితర భారత నాయకులు, హిందువులకు భారత ప్రజలకు చేసిన విజ్ఞప్తులను గమనించిన లియాఖతాలీ ఖాన్‌గారి ఉపన్యాసము తమ అనుచరులను మభ్యపెట్టుట కుద్దేశించినట్లున్నది. అల్లరులను యుద్ధస్థితిగ నెంచి దుండగీడులకు ఎట్టి కరుణ చూపబడదని పండిత నెహ్రూ తెలియజేసెను. ఢిల్లీ యందు ప్రభుత్వము తీసికొనిన కఠినచర్యలే అందుకు నిదర్శనము. వారి ప్రకటనలు, వారు చేసిన ఏర్పాట్లు ప్రపంచమునకు తెలియును. గాంధిజీ పంజాబు పర్యటన మాని ఢిల్లీయందే యుండి, హిందూ ముస్లిము శరణార్థులకు సమాన సౌకర్యములు కలుగునట్లుగ జూచి ఉభయ మతములవారు ద్వేష భావమును విసర్జించునట్లు తన యావచ్ఛక్తిని వినియోగించుచుండెను.

భారతనాయకులు ఈ విధముగ కృషి చేయుచుండ పాకిస్థాన్ నాయకులు పరనిందతో తృప్తిపడుచుండిరి. తమ మతస్థులకు ఇంత వరకు గట్టి హెచ్చరిక నివ్వలేదు. తమ ప్రాంతములోని నిజస్థితిని బయటి ప్రపంచమునకు తెలియ నిచ్చుట లేదు. గాంధీజీ అనినట్లు పాకిస్థాన్ వదలవలదని హిందువులకు, సిక్కులకు లీగు నాయకులు ఎందుకు విజ్ఞప్తులను చేయగూడదు? పై పెచ్చు వారి ఉపన్యాసములు ప్రకటనలు, ముస్లిములకు ప్రోత్సాహ మిచ్చుచున్నవి గాని, ముస్లిమేతరులకు నమ్మకము కలుగచేయుటలేదు. "మనలను నాశనముచేయ సంకల్పించుకొన్నవారు, మనలను చుట్టియున్నారు. పాకిస్థాన్ కుదుటపడిన భారత దేశమునంతను పాలింపవలెనను వారివాంఛ ఈడేరదు" అనుట కేవలము రెచ్చగొట్టుటే కదా? లియాఖతాలీఖాన్‌గారి ఉపన్యాసము జర్మనులను ఉద్రేకులను చేయుటకు వెనుక హిట్లరు, ఇతరులు తమకు చేసిన అన్యాయములను ఏకరువుపెట్టిన ధోరణియందున్నది. తామె లెక్క చూచివచ్చి చెప్పినట్లు తూర్పు పంజాబులో ముస్లిములు లక్షకు పైగా చనిపోయిరనీ, 10 లక్షలకు పైగా నష్టపోయిరనీ గజ్నఫరాలీ ఖాన్‌గారు తెలుపుచున్నారు. తమ ప్రచారమునకు అనుకూలముగా [illegible] ఆ రాష్ట్రమును వదలిన, హిందువుల సంఖ్యను తక్కువగ వర్ణించుచున్నారు. ముస్లిములీగు పరిపాలన ప్రాంతములో అన్నీ చక్కగ యున్నవని ప్రపంచ మనుకొనవలెనని కాబోలువారి అభిప్రాయము? పండిత నెహ్రూ చెప్పినట్లు ఉభయ ప్రాంతములను వీడినవారి సంఖ్య సరిసమానముగనే యుండగలదు. లీగునాయకులు కనుక ప్రస్తుత వైఖరినే సాగించిన శాంతిస్థాపనకు ఏమాత్రము దోహదము కాజాలదు. గాంధీజీ అంతటివాడు, పాకిస్థాన్ ప్రభుత్వమును ప్రత్యక్షముగ విమర్శించి, "పాకిస్థాన్ కనుక తన తప్పును సర్దుకొనకపోయిన పాకిస్థాను, భారత దేశముల మధ్య యుద్ధము తప్పదు" అనుట మూలమున పాకిస్థాను ఎంత దారుణ పరిస్థితిని తెచ్చిపెట్టినదో వేరుగ చెప్పనవసరము లేదు. అది బహుశః విచ్ఛిత్తికి నిదర్శనము.

## కొప్పల్‌లో ముస్లిం ప్రముఖుల సత్యాగ్రహం

హైదరాబాదు, సెప్టెంబరు 16 :

రాయచూరుజిల్లా కొప్పల్‌లో మౌలానా నూర్ మహమ్మద్‌గారూ, మరి నలుగురూ సత్యాగ్రహం చేశారు. వెయ్యి పైచిలుకు జనం కూడిన బహిరంగ సభలో ఉపన్యసించారు. నిజాం సంస్థానం భారత సమాఖ్యలో చేరవలసిన ఆవశ్యకతను నొక్కి వక్కాణించారు.

నూర్ మహమ్మద్‌గారు ఉపన్యసిస్తూ, 'అజాద్ హైదరాబాదు' అనే నినాదం స్వప్రయోజన కాంక్షులూ, స్వార్థపరులూ లేవనెత్తినదనీ, సంస్థానం భారత సమాఖ్యలో చేరాలనీ అన్నారు.

### కొచ్చిన్ ప్రజామండలి తీర్మానం

కొచ్చిన్ సంస్థాన ప్రజామండలివారు ఈనెల 8 వ తేదీన, నిజాం, మైసూరు సంస్థానాల ప్రజల సత్యాగ్రహోద్యమాలను బలపరుస్తూ ఈ దిగువ తీర్మానం చేశారు: నిజాం, మైసూరు సంస్థానాల పరిపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనకోసం వీరోచిత పోరాటం జరుపుతున్న ఆయా సంస్థానాలలోని కాంగ్రెస్ సంస్థలకూ, ప్రజలకూ పరిపూర్ణ సహాకారం, సానుభూతి చూపవలెనని ఈ కమిటీ వారు కొచ్చిన్ ప్రజానీకాన్ని కోరుతున్నారు. భారత దేశం నుంచి బ్రిటిషు సామ్రాజ్యవాదమే వెడలిపోయినది గమనించికూడా, నిజాం మైసూరు ప్రభుత్వాలు ఇంకా, జన్మహక్కులు సాధించేందుకు జరిగే ప్రజా ఉద్యమాలను అణచివేయగలమనే భ్రమలో ఉండడంచూసి ఈ కమిటీవారు ఆశ్చర్యపడుతున్నారు. ఆయా ప్రభుత్వాలు వివేకమూ, విచక్షణా చూపించలేకపోతుంటే, అమాయకులూ, నిరాయుధులూ అయిన ప్రజల రక్తపాతం ఇక ఎంతమాత్రం జరుగకుండా, చివరకు ఆ ప్రజలకైతే తాము లొంగిపోవడం తప్పదో వారికి వెంటనే పరిపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వాలు ఏర్పరచాలని ఈ కమిటీ అభిప్రాయపడుతున్నది.

### పత్రికలపై నిర్బంధం

నిజాం సంస్థానంలోని పత్రికా సంపాదకులూ, ప్రకాశకులూ, ముద్రాపకులూ ఎవ్వరూ న్యాయవిరుద్ధ కార్యకలాపాలను గానీ, మతకల్లోలాలనుగానీ, ఏవిధంగా సంబంధించిన వార్తలను ఈ విషయమై ఏర్పడిన సంఘం అనుమతిలేనిదే, ముద్రించడం, ప్రచురించడం చేయరాదని నిజాం ప్రభుత్వం ఒక నిషేధపు ఉత్తరువుచేసింది. ఇందుకు ఏర్పాటైన సంఘంలో స్థానిక పత్రికల సంపాదకులు 7 గురున్నారు.

### లైసెన్సు లేకుండా ఆయుధాలు

లైసెన్సు లేకుండా తమవద్ద నున్నట్టి ఆయుధములను మందుగుండు సామగ్రిని అక్టోబరు 1 వ తేదీ లోపుగా సమీప పోలీసు ఠాణాలో ఒప్పగింప వలసిందిగా సింధు ప్రజలను హెచ్చరిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. ఈ విధంగా చాలామంది వద్ద ఆయుధాలున్నవనీ, అక్టోబరు 1 లోగా పోలీసు వారి వశం చేయబనకపోతే ప్రతి ఇల్లూ సోదాచేసి వాటిని వశపర్చుకోవడమువుతుందని ప్రభుత్వ ప్రకటన స్పష్టంచేసింది. అక్టోబరు 1 లోగా ఇచ్చినవారిపై ఎట్టి చర్యా తీసుకోన బనదని రాష్ట్ర ప్రభుత్వం హామీ ఇచ్చింది.

### శ్రీ ప్రకాశ్‌గారు

కరాచీ, సెప్టెంబరు 16 : ఇండియా హైకమిషనరు శ్రీ ప్రకాశ్‌గారు ఈరోజు ఢిల్లీనుంచి ఇక్కడికివచ్చారు. సింధులోని అల్పసంఖ్యాక వర్గాలను సురక్షిత ప్రాంతాలకు చేర్చడం గురించి వీరుపాకిస్తాను మంత్రులతో చర్చిస్తారు.

## ఢిల్లీ పరిస్థితులు

### చెదురువాటుగా కొట్లాటలు : దోపిడులు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16: ఈరోజు ఉదయము కర్ఫ్యూ అయిపోగానే చెదురువాటుగా చెలరేగిన కొట్లాటలను అణచివేయడానికి మిలటరీ వారు తుపాకులు కాల్చవలసి వచ్చింది. ఎంతమందికి ప్రమాదము ఆయిందీ తెలియలేదు. కన్నాటు ప్రదేశములో దుకాణాలను దోచివేయడానికి వచ్చిన పిల్లవాండ్ల ముఠాను మిలిటరీవారు తరిమివేసినారు. ఢిల్లీకి ఇంకా ఎక్కువగా మిలటరీవారు వస్తూవున్నారు.

గుర్గాన్, మొదలైన ప్రాంతాలలో తీవ్రముగా మిలిటరీవారు గస్తీతిరుగుతూ ఉన్నారు. భాటిండా రైలుస్టేషన్ దగ్గర సాయుధులయి వచ్చిన మూకలను రైలుబండిలో కాపలాగా వస్తూవున్న మిలటరీవారు తరిమివేసినారు. ఈ సందర్భములో ఇద్దరికి గాయాలు అయినవి. అసోటి రైలు స్టేషనువద్ద దుండగులు బండ్లతో సహావచ్చి రైలువాగన్లు దోచుకొని దోచుకొన్న సొత్తును బండ్లమీద వేసుకొని పోతూ ఉండగా అక్కడ గస్తీ ఉన్న మిలటరీవారు వారిమీద తుపాకులు కాల్చినారు. దుండగులకు ప్రమాదము ఆయింది. షేకిపుర్ ఆనేగ్రామములో గస్తీ ఉన్న మిలిటరీమీద దుండగులు తుపాకులు కాల్చినారు. వెంటనే మిలటరీవారున్నూ తిరిగి తుపాకులు కాల్చినారు. అందువల్ల నల్గురు చనిపోయినారు.

ఆరుగురికి గాయాలుఆయినట్లు తెలుస్తూ ఉంది. ఆ గ్రామములో మిలటరీ పికెట్‌ను ఉంచినారు.

సాహారపు వాయవ్యభాగాన 11 మైళ్ల దూరములో ఉన్న రాజౌరుగ్రామములో సంక్షోభము చెలరేగింది. ఏడ్గురుమంది చనిపోయినారు. నలభై అయిదుమందిని అరెస్టు చేసినారు.

అంబాలాపట్టణము ప్రశాంతముగానే ఉంది. ధరంపూరులో కాందిశీకులను దుండగులు బటకాయించి ముగ్గురిని చంపివేసినారు. వెంటవున్న మిలటరీవారు బలప్రయోగముతో దుండగులను తరిమివేయకలిగినారు. సుల్కాగ్రామములో ఇప్పుడు 8000 మంది కాందిశీకులు ఉన్నారు.

ఇప్పుడు అమృతసరు నగరమున్నూ లాహోరుజిల్లాలో తూర్పు పంజాబుకు వచ్చిన భాగమున్నూ ప్రశాంతముగా ఉన్నవి. పన్నెండువేలమంది కాందిశీకులు ఇప్పుడు మిలటరీ కాపలాతో పాకిస్తాన్ వెళ్లుతున్నారు.

### కాందిశీక శిబిరాలు

ఇప్పుడు ముస్లిం కాందిశీకుల కోసం ఏర్పాటుచేసిన పురాణఖిల్లా శిబిరమున్నూ హుమయూన్ గోరీ శిబిరమున్నూ ముస్లిము కాందిశీకులతో నిండిపోయినవి. అందువల్ల మరి ఒక శిబిరాన్ని ఏర్పాటు చేయవలసిన ఆగత్యమువచ్చింది. పాకిస్తాన్ వెళ్లిపోతామనే ముస్లిములకు ఏ ఇబ్బందులూ లేకుండా పంపించివేసే ఏర్పాట్లు అన్నీ చేసినారు. కమకమ స్వగ్రామాలకే వెళ్లిపోయి ఉంటామనే కాందిశీకుల భద్రత విషయము ఒక సమస్యగా అయిపోయింది. పడమటిపంజాబునుంచి వచ్చిన ముస్లిమేతర కాందిశీకుల పునఃస్థాపన ప్రయత్నాలు కాందిశీకుల మంత్రాంగ శాఖవారు చేస్తున్నారు. ముందుగా ఆయా వ్యక్తులు ఏ ఏ పనులు చేయగలరో మొదలయిన వివరాలతో ఒక జాబితాను తయారుచేస్తున్నారు. ఈ విధముగా వారి వారి యోగ్యతలన్నీ తెలిసిన తరువాత వారి పునఃస్థాపనము గా చేయబడుతారు.

### అందరూ పాకిస్థాన్ సురక్షితంగా చేరారు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16 : తూర్పు పంజాబు పరిస్థితులు మెల్లమెల్లమీద చక్కబడుతూ ఉన్నట్లుగా తెలుస్తూ ఉంది. నిన్న టిదినము ఏ సంఘటనలులేవు. మిలటరీ బలప్రయోగమువల్ల కొంతమందికి ప్రమాదము ఆయి ఉండవచ్చును. కాని మరి ఏ ఇతర సంక్షోభము వల్లనూ ఎవరికీ ప్రమాదము కాలేదు.

పాకిస్థాన్‌కు బయలుదేరిన ముస్లిము కాందిశీకుల బారులో ముందరి భాగము ఇప్పుడు పాకిస్థాన్ సరిహద్దులోకి వచ్చింది. ఈ కాందిశీకుల బారులో వివిధ జిల్లాల వారున్నూ వచ్చి చేరినందువల్ల కొన్ని మైళ్ల పొడుగున ఉంది.

పాకిస్థాన్ అధికారులతోనూ, వారి కుటుంబాలతోనూ సెప్టెంబరు 14 వ తేదీన ఢిల్లీనుంచి బయలుదేరిన ప్రత్యేకపు రైలుబండ్లు పాకిస్థాన్ సురక్షితముగా చేరినవి. ఒక రైలుబండి లాహోరు చేరిపోయిందనీ రెండో రైలుబండి లాహోరు పట్టణము సమీపిస్తున్నదనీ వర్తమానాలు వచ్చినవి. పడమటి పంజాబునుంచిన్నీ సరిహద్దు రాష్ట్రమునుంచిన్నీ వర్తమానాలు ఏవీ రాలేదు.

### కాందిశీక శిబిరాల రక్షణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 15 : ఢిల్లీ నగరములో ఉన్న బ్రిటిషు దండును ప్రభుత్వమువారు కాందిశీకుల శిబిరాలకు రక్షణకొరకై ఇప్పుడు ఉపయోగించుకొంటున్నారు. ఇప్పుడు ఢిల్లీ కాంటోన్ మెంటులో రెండు బ్రిటిషు పటాలాలు వున్నవి. ఈ రెండు పటాలాలవారున్నూ బ్రిటిషు దేశమువెళ్లేటందుకు జాంబాయి జేరుతారు. సరిఒక బ్రిటిషు దండు కాందిశీకుల శిబిరాలను నడపడానికి అంగీకరించింది. అందుకు ప్రభుత్వమువారు సంతోషముతో అంగీకరించినారు. ఈ బ్రిటిషు పటాలాలవారు దేశములో శాంతిభద్రతలకోసము పనిచేయరు. అందువల్ల కాందిశీకుల శిబిరాలను భారతీయ సైనికులే కాపలాకాస్తూ ఉన్నారు. బ్రిటిషు దండుకు సంబంధించిన అధికారులు మొదలయినవారు ఆయా శిబిరాలలో సరిగా ఆహారపదార్థాలను సరఫరా చేయించడమూ ఇంకా ఆయా కార్యాలయాల వ్యవహారాలను చక్కబెట్టడమూ మొదలయిన సివిల్ అధికారులు చేసేపనులను చేస్తున్నారు.

### ఢిల్లీలో నేలసొరంగములలో మందు గుండు ఫాక్టరీలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16 : గత కొలది రోజులలో పోలీసులు, మిలిటరీవారు ఢిల్లీలో దుండగీండ్రను పట్టివేయునప్పుడు ఆయుధములు, మందుగుండు సామగ్రి విశేషముగా దొరికెను. నేలసొరంగములలో మందుగుండు సామగ్రి ఫాక్టరీలు గూడ చాలా కనబడెను.

మిలిటరీవారుపోలీసువారుచాలాఆయుధములను మందుగుండు సామగ్రిని వశపరచుకొన్నను, ఢిల్లీ నగర మందలి వివిధ ప్రాంతములను బాగా శోధించినయెడలనే సొరంగములలో దాచియుంచిన మందుగుండు సామగ్రి కరాయలు చాలా కనబడవచ్చునని విశ్వసింపబడుచున్నది.

సుబాయ్ మండి ప్రాంతాలలో ఇటీవల జనసమూహము ఒకముస్లిమ్ గృహమును తగుల బెట్టినప్పుడు కట్టుదిట్టములతో నడుపబడుచుండిన ఒక మందుగుండుసామగ్రి ఫాక్టరీ కనబడెను. ఆయింటిలో నేల సొరంగమునందు 4 గదులు, ఒక వసారా, కొన్ని స్నానపు గదులు ఉండెను. వీనికి విద్యుచ్ఛక్తి యేర్పాట్లు, నీటిసరఫరా ఏర్పాట్లు ఉండెను. కర్మాగారముగా నుపయోగింపబడిన గదిలో నూనె యింజను చాలా యంత్రములుండెను. ఇవి బాంబులు, తోటాలు చేయుటకు ఉపయోగింపబడుచుండెనని చెప్పుచున్నారు. ఆయింటిలో ద్రావకము గంధకము, అమోనియా పట్టుబడెను.

ఇంటిలోనివారు తీవ్రముగా ప్రతిఘటించిరని, జనసమూహములపై వాళ్లు గంటలు తుపాకులుకాల్చిరని తెలియుచున్నది.

### ట్రీస్టీ పరిస్థితి

ట్రీస్టీ, సెప్టెంబరు 16 : ఇటలీతో జరిగిన శాంతి సంధి షరతుల ప్రకారం ట్రీస్టీ స్వతంత్ర నగరం అయింది. స్వతంత్రస్థాపనతో పాటు అనేక అల్లరులు చెలరేగినవి. నగర పరిస్థితులు ఈ విధంగా ఉండగా స్వతంత్ర నగరమైన ట్రీస్టీపొలిమేరలలోకి ఈనాడు యూగోస్లావియాసేనలు తోశివచ్చినవి. సంధి షరతుల ప్రకారం నగరంలో సమాన సంఖ్యగల అమెరికన్ బ్రిటిషు సేనలతోబాటు 5000 మంది యూగోస్లావ్ సైనికులు కూడా నగర తాత్కాలిక పరిపాలనా నిర్వహణంలో పాల్గొనవచ్చు. ఇటలీ యూగోస్లావియాల మధ్యవున్న ఇస్ట్రియన్ ద్వీపకల్పంనుంచి బ్రిటిషు అమెరికన్ సేనం ఉపసంహారం జరిగింది. [illegible] ప్రాంతంలో సమీపంలో, అమెరికా బాధ్యతకు స్థానానికి వెళ్ళనివ్వవలసిందని 15 వ తేదీ రాత్రి కొంతమంది యూగోస్లావ్ సైనికులు దుందుడుకుగా ప్రవర్తించి పట్టుదలగా కోరారు. అక్కడ వున్న అమెరికన్ సైనికులు యుద్ధకార్యకలాపానికి ఉపక్రమించబోయేసరికి యూగోస్లావ్ సైనికులు వెనుకకు మరలటానికి తిరోగమించడం సంభవించింది. మిత్రసేనాని మేజర్ జనరల్ టి. ఎస్. ఎయిరీ అనలేదని ఈసంఘటన పరిష్కారం కాగలదని చెబుతున్నాడు.

సాన్ జియార్జియోలో మావుర్లోజాల క్రితం ఒక కమ్యూనిస్టు క్లబ్బుపై మరఫిరంగి కాల్పులు జరిగినప్పుడు ఎమ్మా సెరెనీ అనే 11 సంవత్సరాల బాలిక మరణించింది. కమ్యూనిస్టు నినాదాలుచేస్తూ 10 వేలమంది ప్రజలు ఈబాలిక శవపేటిక వెంట వీధులలో పెద్ద ఊరేగింపు జరిపారు. నగరంలో ట్రేడ్ యూనియన్ సంఘాలు సమ్మె సాగిస్తున్నవి. కార్మికులందరూ ఊరేగింపులో పాల్గొనే నిమిత్తమే ఈ సమ్మె ప్రారంభించారు. ఇటలీకిగాని, యూగోస్లావియాకుగాని అనుకూలంగా ఏవైనా ప్రదర్శనలు జరిగి అల్లరి ఏర్పడితే ఎదుర్కొనడానికి పోలీసుబలం తయారయే వున్నదట.

## 'ఆయుధాల నేగాక యుద్ధాలోచనను మనం పూర్తిగా బహిష్కరించాలి'

### స్నేహభావంతో వివిధ సమస్యా పరిష్కారం జరగాలని ఐక్యరాజ్యసమితి అధ్యక్షుని హితవు

ఫ్లషింగ్ మెడోస్ (న్యూయార్కు), సెప్టెంబరు 16: "ఐక్యరాజ్య సమితిని గూర్చి ప్రపంచములో సందేహము, కలవరపాటు వ్యాపించిపోతున్న"దని చెబుతూ ఐక్యరాజ్య సమితి నూతనాధ్యక్షుడు, బ్రెజిల్ ప్రతినిధివర్గ నాయకుడు నగు ఆస్వాల్డో ఆర్నా ఐక్యరాజ్య సమితి సర్వసభ్య ద్వితీయ సమావేశమును ప్రారంభించెను.

ఉపన్యాసం పూర్తిపాఠం:

"అసలు విషయ మేమిటంటే, గత సమావేశంనుండి యిప్పటివరకూ ఐక్యరాజ్య సమితి సాధించిన దేమీలేదు. మన ఎజండాలో చాల విషయములు వున్నవి; కాని యివన్నీకూడా ఒకేఒక ప్రశ్నగా మారిపోతున్నవి. మనం శాంతిమార్గము నవలంబింతమా? కలహమార్గము నవలంబింతమా?

విషవాయువు, ఆటంబాంబు మొదలగు సర్వవినాశకర ఆయుధముల ఉత్పత్తి బహిష్కరించిన చాలదు. ఆయుధములను కాదు, యుద్ధాలోచననే మనం బహిష్కరించాలి. యుద్ధానంతరం సర్వసాధారణమైపోయిన ఈకలహాలు ఆయుధసంపత్తి ద్వారాగాక, స్నేహభావముతో మనం పరిష్కరించాలి. ఆత్మహత్యల కాలవాలము ప్రపంచమునందు మనకు విశ్వాసం లేదు. కాబట్టి ప్రపంచములోని సర్వజాతుల, సర్వమతముల ప్రజలకు ఐక్యరాజ్య సమితిలో విశ్వాసం కల్గించుటమే మనకర్తవ్యం. ఆ విధంగానే వారిని మనం నిరాయుధులను, యుద్ధవిముఖులనుచేసి, శాంతికాముకులుగా తయారుచేయగలం. ఈ ప్రపంచంలో ఇదివరకెన్నడూ యింత మహత్తర ఆర్థిక, ఆధ్యాత్మికశక్తులు ఈ కార్యంకొరకు ప్రయత్నించి ఉండలేదు. మానవుని విజ్ఞానమునకు, ప్రతిభకును, ప్రజల యొక్కయు, ప్రభుత్వముయొక్కయు సౌహార్దతకు యింతటి సవాలు మరెన్నడూ జరిగినట్లు నాకు తెలియదు. కాని ఈసవాలు మనం అంగీకరిస్తేనే తప్ప, ప్రపంచ వినాశనం అరికట్టలేము."

"ఈనాటి యూరప్ ఆర్థికంగా విషాదాంతము, సైనికంగా ప్రశ్నార్థకము. ఆసియా లో రక్తపువాహిని లింకా సరిగా యింకిపోనేలేదు. ప్రశాంతతతో జీవిస్తున్న ఖండము అమెరికా ఒక్కటియే!"

"మనము చేయవలసినదని విశదము, నిరాక్షేపణీయము. మనుష్యులొకరినొకరు అర్థంచేసికొనలేక పోవటవలనగాని, ప్రజల వైమనస్యభావము జరుపుటంవలనగ్గాని, మనకార్యం! ప్రపంచప్రజాభీష్టప్రకారం మనం నిర్వహించలేకపోవుటంవలన గాని ఇక్కడ ఆసీనమైవున్న ఈ ప్రపంచము (ప్రతినిధులని అర్థము) విఫలితమైపోవచ్చును. కాని చరిత్రాత్మకంగా, స్వాభావికంగా పరిశీలిస్తే, మానవు డెప్పుడూ ఐక్యతకొరకే పాటుపడతాడని తెలుస్తున్నది" అని సెనార్ ఆర్నా ఉపన్యసించెను.

న్యూయార్కు మేయర్ విలియం ఒడ్వయర్ స్వాగతోపన్యాసం చేసెను, సభ రేపటికి వాయిదావడింది.

### ధాన్యం ధరలు గురించి ఆంధ్ర కిసాన్ కాంగ్రెస్ వినతి

చెన్నపురి, సెప్టెంబరు 17: వ్యవసాయమునకగు ఖర్చునుబట్టి ధాన్యం ధరను బస్తా రు 20 కనీసం నిర్ణయించవలెనని కోరుచూ ఆంధ్రరాష్ట్ర కిసాన్ కాంగ్రెస్ వారు చెన్నరాష్ట్ర ధాన్యధరల నిర్ణయ సంఘమునకు (ప్రైస్) ఒక నివేదికను సమర్పించినారు. నివేదికలో ఈక్రింది వివరములనుకూడా నాలించినారు.

ఉత్పత్తిదారులకును కొనుగోలుదార్లకును మధ్య ఎట్టి మధ్యవర్తులూ ఉండరాదు. ఉత్పత్తి కొనుగోలుదార్ల సహకార సంఘములను ప్రోత్సహించవలెను. మిల్లుయజమానులకు అనవసరముగా అపారలాభమునిచ్చు ప్రస్తుత విధానమును మానవలయును. వివిధ రకాల ధాన్యాలకు ధరలలో తేడాలుండరాదు. అన్నిటికీ ఒకే ధర ఉండవలెను. లేదా అన్నిటికీ రెండు తరగతులుగా విభజించి వానికి అర్ధరూపాయ తేడామాత్రం ఉంచతగును. ధాన్యమును మరపట్టుటకు రెండు మణుగులకు అర్ధరూపాయి చొప్పున మాత్రం నిర్ణయించవలెను. ధాన్యమును సేకరించుటలో పోలీసు బలప్రయోగం చేయరాదు. జొన్నల ధరలనుకూడా పెంచవలెను.

ఈ సందర్భమున నివేదికలో ఈ క్రింది విషయములు తెల్పబడినవి:

రైతులను ప్రోత్సహించకుండా అధికాహారోత్పత్తి ఉద్యమం తలపెట్టినందువల్ల నే ఉద్యమం విఫలమయినది. ఈ ఉద్యమంపై ఖర్చు పెట్టిన లక్షల రూపాయలను ధాన్యం ధరలకు ఇచ్చినట్లైన ధాన్యం అధికంగా ఉత్పత్తి కాగలిగియుండెడిది.

అనేకరెట్లు పెరిగిపోయిన ఇతర అవసర వస్తువులకు ధరలను తగ్గించి నిర్ణయించినచో ధాన్యమునకు ప్రస్తుత ధరను నిర్ణయించిననూ న్యాయముగా నుండెడిది. కాని ప్రస్తుత ధాన్యపుధర యుద్ధపూర్వపు ధరకంటె రెట్టింపుమాత్రమే ఉన్నది.

ఉదాహరణకు గుడ్డధర యుద్ధానికి పూర్వం గజం పావలా ఉన్నది ఇప్పుడు రెండు రూపాయలకు పెరిగింది. వ్యవసాయానికి అవసరమైన్యబండిధర రు 70 నుంచి రు 360 కు పెరిగింది. వ్యవసాయ కూలీల కూలి రోజుకు రు 0-5-0 నుంచి రు 1-4-0కు పెరిగింది. ధాన్యం (రెండవరకం) ధర రు 5-0-0 నుంచి రు 10-6-0 కు మాత్రమే పెంచబడింది.

ఈపరిస్థితులలో బియ్యం నిర్ణీత ధరలకు రేషన్ షాపులలో కూడా దొరక్క అనేక ప్రాంతాలలో ప్రజలు దొంగమార్కెట్టులో నేను రూపాయి చొప్పున కొనవలసి వస్తున్నది. అందువలన ధాన్యం ధరలను కొద్దిగా పెంచినట్లయితే రేషను షాపులలో దొంగమార్కెట్ ధరలకంటె చౌకగా బియ్యం దొరకడానికి వీలవుతుంది.

### ఇతర రాష్ట్రములలో ధరలు

ధాన్యం ధరలను పెంచకుండా కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆటంకపెట్టుటకు హేతువులేదు. ఎదుకనంటే ఇతర రాష్ట్రాలతో పోల్చిచూచినట్లయితే చెన్నరాష్ట్రములో ధరలు చాలా తక్కువగా నిర్ణయించబడినవి. మధ్యపరగణాలు సంయుక్త పరగణాలు, సింధు, ఒరిస్సా రాష్ట్రములలో ధరలు మణుగుకు రు 9, రు 10 నిర్ణయించబడగా చెన్నరాష్ట్రంలో రు. 5-8-0 మాత్రమే నిర్ణయించబడింది. అందువల్ల ధరలు పెంచకపోవుటకు కేంద్ర ప్రభుత్వానిదేకాక రాష్ట్ర ప్రభుత్వం కూడా నింద వహించవలసి యుండును.

ధాన్యం ధరలను మణుగుకు ఈ క్రింది రీతిగా హెచ్చించవచ్చునని ఆయా జిల్లాల కలెక్టర్లు సలహాలనిచ్చి యున్నారు.

కృష్ణా-రు 1. గుంటూరు రు 1-4-0 బళ్లారి రు 1-0-0 చిత్తూరు రు 0-10-8 కడప రు 1-8-7, కోయంబత్తూరు రు 2-0-0.

అయితే చెన్నరాష్ట్రంలో ధాన్యం ధరను కనీసం మణుగు రు 10 నిర్ణయించవలెనని నివేదికలో సూచించ బడినది.

## గాంధిజీతో నాయకుల గోష్ఠి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 17: ఇవ్వాళ ఉదయం మౌంటుబాటెన్ ప్రభ్వి మహాత్మా గాంధిని దర్శించి వారితో దాదాపు ఒక అరగంటసేపు ఉన్నారు. ఆమె వచ్చినప్పుడు అక్కడ భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు కూడా ఉన్నారు.

నెహ్రూ గాంధిజీతో మూడుగంటలు పైగా సంభాషించారు. రాష్ట్రపతి కృపలానీగారు తర్వాత వచ్చి వారిని కలుసుకున్నారు. ఉపప్రధాని సర్దార్ పటేల్, విద్యామంత్రి మౌలానా అబుల్‌కలామ్ ఆజాద్‌గార్లు కూడా ఇవ్వాళ ఉదయం నెహ్రూ ప్రభృతులు రావడానికిముందే గాంధిజీని దర్శించారు.

## ప్రజా పరిషత్ ఆఖరు సమావేశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 15: కేంద్ర ప్రభుత్వం ప్రస్తుతం పంజాబు, సింధు, సరిహద్దు రాష్ట్రాలనుంచి వస్తున్న కాందిశీకుల రక్షణ సహాయ కార్యక్రమాలలో నిమగ్నమై వుండడంచేత మొదట అనుకున్న అధినివేశ పార్లమెంటు సమావేశ కార్యక్రమము, రాజ్యాంగపరిషత్తు సమావేశ కార్యక్రమమూ పూర్తిగా మారిపోవలసి వచ్చింది.

డొమినియన్ పార్లమెంటునవంబరు 17 న సమావేశమై, ఆ నెల ఆఖరువరకూ జరపడానికి నిర్ణయించడమైనది.

ఆ తర్వాత కొద్దిరోజులకే భారత రాజ్యాంగపరిషత్ ఆఖరు సమావేశం ప్రారంభమవుతుంది. డిసెంబరు మొదటి వారంలో ప్రారంభమయే రాజ్యాంగ పరిషత్తు ఆఖరు సమావేశం దాదాపు ఆరు వారాలపాటు జరగవచ్చు. ఇది పూర్తి అయిన ఒక పక్షం రోజులకే అధినివేశ శాసనసభ బడ్జెట్ సమావేశం ప్రారంభమవుతుంది.

1935 ఇండియా ప్రభుత్వ చట్టంలోని 8 వ సెక్షను క్రింద కేంద్రశాసనసభకు ఏ నిబంధనలు వర్తించేదో, వాటినే అధినివేశ శాసనసభ సమావేశానికీ కొన్ని మార్పులతో వర్తింపజేస్తారు. (యు. ప్రె.)



రడారు

తంతీ, టెలిఫోనూ, వైర్‌లెస్సూ కనిపెట్టడంతో వచ్చిన మరోవింత **రడారు.** దూరం వస్తువుల్నిగాని, అదృశ్యమైన వస్తువుల్నిగాని, నిమిష దూర శ్రవణ (మినిట్ రేడియో) తరంగాల ప్రతిధ్వనినుండి చూచి చెప్ప వచ్చును. ఈ విధంగా రడారు దూరంచేతగాని, చీకటిచేతగాని, కంటి జబ్బుచేగాని చూడలేని వస్తువును చూడ్డానికి తోడుపడుతుంది. బాంబును వేసేవాడెక్కడున్నాడో చూచి కనిపెట్టు రక్షక ఆయుధంగా పనిచేసి, బ్రిటీషువారికి యుద్ధంలో విజయం చేకూర్చిందది. తరువాత అది గొప్ప యుద్ధసాధనం అయ్యి శత్రుబలాన్ని భగ్నం చెయ్యడానికి తోడ్పడింది.

శాంతి సమయంలో అది చేయవలసిన పనులింకా చాలా ఉన్నాయి. అది గాలి అనుకూలంగా లేనప్పుడు, సముద్రంలో ప్రయాణంచేసే ఓడలు సులువుగా నడిచేలా చేయగలదు. **రడారు** కిరణంగుండాపోతే, విమానాలు సురక్షితంగా వాటిగమ్యస్థానాన్ని చేరుకుంటాయి. ఈ విధంగా యీ రోజుల్లో ప్రయాణాల్లో గలిగే అనేక ప్రమాదాలు తప్పిపోతాయి దీనివల్ల. ఈవిధంగా యుద్ధసాధనం శాంతిసమయంలో మంచిపనులకై పనికివస్తుంది.



# సింగరేణి బొగ్గుగనుల కార్మికులు

## ఇబ్బందుల గురించి ప్రధాన కార్యదర్శి ప్రకటన

కొత్తగూడెం, సెప్టెంబరు 10: సింగరేణి బొగ్గుగనుల కార్మికులసంఘం ప్రధాన కార్యదర్శి పి. చలపతిరావుగారు ఈ విధముగా ప్రకటిస్తున్నారు:

"నిజాం ప్రభుత్వము కమ్యూనిస్టులనే నెపంపై అరెస్టుచేసి డిటెన్షన్‌లో వుంచిన కొత్తగూడెం బొగ్గుగనుల కార్మిక నాయకులను కొందరిని ఆగస్టు 15 తరువాత విడుదల చేసినది. వారు తమ పూర్వపు ఉద్యోగాలు యివ్వమని కంపెనీవారిని అడుగగా క్షమాపణ పత్రము వ్రాసియివ్వమని మేనేజిమెంటు కోరినది. అందుకు కార్మిక నాయకులు నిరాకరించారు.

దాని నవతాళముగా తేదీనుంచి 6-9-47న కార్మిక నాయకులతో ముఖ్యులైన బోయి రామస్వామి, శెట్టి రాజం, బాబయ్య గార్లను స్థానికపోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు అరెస్టుచేసి హింసించారు. అదే సాయంత్రం బండిలో ఆ ముగ్గురు నాయకులను వరంగల్లు తీసుకుపోయి డి. ఎస్. పి. వద్ద హాజరు పర్చినారు. ఆయన ముగ్గురు నాయకులను కొత్తగూడెం వెళ్లి మేనేజిమెంటుకు రాజీనామా పత్రం వ్రాసియిచ్చి, కంపెనీవారు పనియిస్తే చేయండి. లేకపోతే వూరుకొండని సలహాయిచ్చి పంపాడు.

మరల వారిని స్థానికపోలీసులు 7-9-47 రాత్రికి కొత్తగూడెం తీసుకొనివచ్చి రాజీనామా పత్రం వ్రాసియివ్వమని పోలీసు స్టేషన్‌లో నిర్బంధించినారు. కార్మిక నాయకులు నిరాకరించినారు.

మరునాడు 8-9-47 న శెట్టి రాజం, బోయి రామస్వామి గారలు యిల్లెందు తాలూకాలోగాని, ఆసిఫాబాదు తాలూకాలోగాని, ఆరుమాసములవరకు ప్రవేశించకూడదని పోలీసు సబిన్‌స్పెక్టరు ఆర్డరు చేతికిచ్చి గ్రామమునుండి పంపివేసినాడు. బాబయ్యగారిని మాత్రము జామీనుపై విడుదలచేసినారు. వీరుగాక ఇంకా ముఖ్య కార్మికులైన శ్రీ బెజ్జంకి రాజం, వంగ వెంకటి, వంగ రాజేశ్వరరావుగార్లపై కూడ యిట్టి ఆర్డర్లున్నట్లు తెలుస్తున్నది.

ఈచర్యవల్ల కార్మికులలో అసంతృప్తి పుట్రేగము మితిమీరుతూ వున్నది. గాన ప్రభుత్వం వెంటనే కలుగజేసుకొని, కార్మిక నాయకులపై జారీచేయబడిన ఆర్డర్లు ఉపసంహరించుకొని, ఎట్టిషరతులు లేకుండా వారిపనులు వారికిప్పించి అపక్రమముగా ప్రవర్తించిన పోలీసు సబిన్‌స్పెక్టరుపై చర్య తీసుకోవలెను.

## ఆహారపదార్థాల కాటకం

వరంగల్లుజిల్లాలోని మహబూబాబాదు తాలూకా ఆహారపరిస్థితి విషమించింది. గ్రామస్థులు, జొన్నలుగాని, బియ్యంగాని యేమీదొరకక, మొక్కజొన్నగుగ్గిళ్లతో కాలంగడుపుతున్నారు. కొన్నిగ్రామాలలో ఇవికూడా దొరకనందున, స్వంతగృహాలనువీడి, సంసారాలను నెత్తికెట్టుకుని చంటిపిల్లలతో ఖమ్మంమెట్టలకు ప్రాంతాలకు వెళ్లిపోవుచున్నారు. ఈ విధంగా వెళ్లేవారిలో పేదసైరులు, వ్యవసాయకూలీలు ఎక్కువగ నున్నారు. తాలూకా గ్రామాలలోని పంటలుకూడా పూర్తిగా నిరాశాభావాన్నే కలిగిస్తున్నవి. తాలూకాలోని ఈప్రత్యేకపరిస్థితివిషయమై ప్రజలు అధికారుల ముందు మొరబెట్టుకున్నారు. కాని లాభంలేకపోయింది.

మహబూబునగరం జిల్లాలోని చాలా గ్రామాలలో కరువు మొదలైంది. ప్రభుత్వం, ప్రజలకుధాన్యం సప్లై చేయకపోవడమేగాక, గ్రామాలలో, అక్కడక్కడవున్న కొద్దిపాటి తిండిగింజలను, బలవంతంగా స్వాధీనపరచుకుంటున్నది. గ్రామాలనుండి ధాన్యాన్ని పూర్తిగా వసూలు చేయడంలో, పోలీసులతోపాటు ముస్లింయువజనులుకూడా పనిచేస్తున్నారు.

మర్కులం, బంగారంపల్లె, కొమారు, మల్కాపురం, కిష్టంపల్లి, కొత్తపల్లి, పురుషంపల్లి, పామాలి కొండాపురం, దాపిపదపల్లి, కన్మర్ కాల్వ మొదలగు గ్రామాలలో ధాన్యం బొత్తిగాలేదు. ప్రభుత్వం సప్లైచేస్తానన్న మొక్కజొన్నలుకూడా రాలేదు. ఈగ్రామాలలోని చాలామంది కుటుంబాలతో సహా, జీవించడానికి ఇతరగ్రామాలకు వెళ్లారు.

## హైదరాబాద్ రిజర్వు బాంకు స్థాపనాలోచన

నిజాంప్రభుత్వం హైదరాబాద్ రిజర్వుబాంక్ అనేది స్థాపించి, విదేశమారకం ఆ బాంకుకు అప్పగించడానికి వీలుగా 'విదేశమారకంబిల్లు' అనే దానిని ప్రవేశపెట్టాలని ఆలోచిస్తున్నట్లు, ఆర్థికశాఖ కార్యదర్శి శ్రీ ఎల్. ఎస్. గుప్తగారు హైదరాబాద్ శాసనసభలో ప్రశ్నోత్తరాల సమయంలో వెల్లడించారు నిజాం ప్రభుత్వం విలాసవస్తువుల దిగుమతులు తగ్గించివేసి, యంత్రసామగ్రి దిగుమతులు అధికంచేయడం ప్రభుత్వవిధానమనీ, ఎగుమతులు దిగుమతులు విషయంలో ఏక విధానం అవలంబించే విషయంలో భారత ప్రభుత్వంతో సంప్రతింపులు జరుగుతున్నాయనీ, సుంకాలను కంట్రోలు చేసేందుకు ఇదివరకే ఒక సంఘం ఏర్పడిందనీ గుప్తగారన్నారు.

నిజాంనుంచి ఎగుమతి అయ్యేవి సామాన్యంగా ముడిపదార్థాలనీ, భారత సమాఖ్యలోని ఎగుమతి వ్యాపార సంస్థల ద్వారా ఎగుమతులు జరుగుతున్నాయనీ, దిగుమతుల విషయంలో ప్రభుత్వానికి కావలసినవి సరాసరి ఆయా ఉత్పత్తి దేశాలనుంచి, ఎట్టి సుంకాలూ చెల్లించకుండాగానే వస్తున్నాయనీ, స్థానిక వర్తకులకు కావలసినవి భారత సమాఖ్యలోని దిగుమతి వ్యాపార సంస్థలద్వారా వస్తున్నాయనీ, ఇకమీదట ఎగుమతి దిగుమతులు సరాసరి ఆయా దేశాలతోనే జరుపు కొనడానికి ప్రభుత్వం చర్యలు తీసుకొంటున్నదనీ గుప్తగారు మరొక ప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చారు.

నిజాం సంస్థానంలో మూలమూలలకూ టెలిగ్రాఫ్, టెలిఫోన్ సౌకర్యాలు ఏర్పరచేందుకు సొమ్ము మంజూరు చేయాలన్న అనధికార తీర్మానం ఒకటి నేడు శాసన సభలో అంగీకరింప బడింది.

సంస్థాన విస్తీర్ణంలో సైనా మద్యనిషేధం అమలు జరపాలని కోరే ఒక అనధికార తీర్మానంపై చర్చ పూర్తికాకముందే సభ వాయిదా పడింది.

మద్యనిషేధం దశలవారీగా ప్రవేశపెట్టాలని ప్రభుత్వం ఉద్దేశించిందనీ, మత్తుపదార్థాలను డాక్టరు సర్టిఫికెట్లద్వారా లైసెన్సులు పొందితే తప్ప వాడరాదని నిషేధించే ఆలోచన వున్నదనీ రెవిన్యూ మంత్రి నవాబ్ మహమ్మద్ యార్ జంగ్ బహదూర్ అన్నారు.

# గౌతమీ విద్యాపీఠము

## వార్షికోత్సవం

రాజమహేంద్రవరం, సెప్టెంబరు 10: రాజమహేంద్రవరములో గౌతమీ విద్యాపీఠ వార్షికోత్సవము సెప్టెంబరు 5, 6, 7 తేదీలలో జరిగెను. రాళ్లభండి వెంకట సీతారామశాస్త్రిగారి అధ్యక్షతను సభ సమావేశమైనది. జటావల్లభుల పురుషోత్తము గారు సభా ప్రారంభోత్సవమును జరిపిరి. సంస్కృతభాషకు పాఠశాలలందు ప్రాధాన్య మొసంగవలెనని పురుషోత్తంగారు చెప్పిరి. మొదటిదినము మధ్యాహ్నము సభలో కార్యదర్శియైన కాంగ్రేసుల గోపాలరావుపంతులుగారు గౌతమీ విద్యాపీఠముయొక్క కార్యవిధానమును గురించియు, విద్యాప్రణాళికనుగురించియు ముచ్చటించిరి. గత మేనెలలో ఈ పీఠము రిజిస్టరుచేయబడినదనియు ఇంతవరకు దీనికి గదిగా కాంగ్రేసుల శ్రీనివాస జగన్నాథరావుపంతులుగారు ఖర్చుపెట్టిరనియు, 60 ఎ. రముల మాగాణిభూమిని నరసాపురం తా॥ కాళీపట్నముల్లోని భూమిని కాంగ్రేసుల జమీందారుగారు దానము చేసిరనియు యింకను మూలధనమునకు ప్రజాదరణ కావలసి యున్నదనియు కార్యదర్శిగారు తెల్పిరి. నాలుగువేల రూపాయల విలువ గల ప్రాచీన విజ్ఞానగ్రంథములను ప్రోగు చేసితిమనియు సూర్యసిద్ధాంతమును తెలుగులో శ్రీ పాద వెంకటరమణ దైవజ్ఞ శర్మగారిచే వ్రాయించితిమనియు సంస్కృత కావ్యముగా శ్రీ పుల్లెల ఉమామహేశ్వర పండితులు హరివంశము రచించిరనియు, యింకను కొందరు పండితులు గ్రంథములను వ్రాయుచున్నారనియు వాటిని ముద్రించుటకు ధనము కావలెననియు కార్యదర్శిగారు తెలియజేసిరి. తరువాత కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, తెళికిచర్ల గోపాలాచార్యులుగారు, శ్రీ పాద లక్ష్మీనరసింహశాస్త్రిగారు, పుల్లెల ఉమామహేశ్వర పండితులు సభలో ఉపన్యసించిరి.

6 వ తేదీ సభ ముడపాక వెంకటశాస్త్రిగారి అధ్యక్షతను జరిగెను; ప్రాచీన విజ్ఞానములోనుంచి అధునిక విద్యాప్రణాళికలోనికి గ్రహించవలసిన విషయములను గురించి 3 గంటల చర్చ జరిగెను. ఈ చర్చలో కొల్లూరి సోమశేఖరశర్మగారు, హోతా వెంకట్రామశాస్త్రిగారు, పిసుపర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు, రాళ్ళభండి సీతారామశాస్త్రిగారు, అర్క సోమయాజులుగారు పాల్గొనిరి.

### వైదిక విజ్ఞాననిఘంటువు

రాళ్లభండి సుబ్బారావుగారు ఉపన్యసించుచు ఆంధ్రచరిత్ర పరిశోధకమండలికి పండితులను రక్షించి కోరిరి. తమ గ్రంథాలయములో 11 వేల తాళపత్ర గ్రంథములున్నవనియు యీ గ్రంథములను పండితులు పరిశీలించవలెననియు, పరిశీలనకు బూనుకొనువారికి భోజనసదుపాయములను చేసెదమనియు, పూనా వైదిక పరిశోధక మండలివారు వైదిక విజ్ఞానముల ఒక పెద్ద నిఘంటువును ఇంగ్లీషులో తయారుచేయుచున్నారనియు, అట్టిగ్రంథమునే తెలుగులో తయారుచేయవలెననియు పండితులను హెచ్చరించిరి.

### నిరుక్తం - శ్రౌతం తెనుగుతర్జుమా

6 తేదీ సాయంకాలం సభ వారణాసి సుబ్రహ్మణ్యముగారి అధ్యక్షతను జరిగెను. నిరుక్తం, శ్రౌతం, తెనుగులోకి తర్జుమా చేయుటకు సభవారొక ఉపసంఘమును నియమించిరి. పిమ్మట వేదశాస్త్రముల గురించి ప్రసంగములు జరిగెను.

### అధర్వణవేదము

అధర్వణవేదమనునది భారతదేశములో యిద్దరు వ్యక్తుల ముఖములో మాత్రమే యున్నదనియు, వారుకూడ పెద్దలయిరనియు వారితో యీ వేదము అంతరించునేమోయని భయముగుచున్నదనియు దానిని అధ్యయనం చేయతగినవారు ముందుకు రావలెననియు అందుకు ఒకరు సిద్ధముగానున్నారని తెల్పుటకు సంతోషముగుచున్నదనియు యింకను అందుకు సిద్ధపడువారికి తగిన ధనసహాయము చేసెదమనియు జటావల్లభుల పురుషోత్తంగారు హెచ్చరించిరి.

### కవిత్వ పోటీ పరీక్షలు

7 వ తేదీన బులుసు అప్పన్నశాస్త్రిగారి అధ్యక్షతను సభ జరిగెను. వేమళ్ళ అన్నావధానులు, కుప్పా లక్ష్మావధానులు, వేమిళ్ల సూర్యప్రకాశశాస్త్రిల్లు, కడిమాల వీరావధానులు, శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిల్లు వేదార్థమును తెల్పిరి.

కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, పిసుపాటి చిదంబరశాస్త్రి, జటావల్లభుల పురుషోత్తంగార్లు కవిత్వపోటీలను జరిపించిరి. సంస్కృత ఆంధ్రకవిత్వములో మొదటి బహుమాన మొసంగబడలేదు. సంస్కృతకవిత్వములో శ్రీహావ సోమేశ్వరశాస్త్రిగారికి, తెలుగు కవిత్వములో మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి ద్వితీయ బహుమాన మొసంగబడెను.

### పండిత సన్మానము

వేదశాస్త్రపరిషత్తువారు పరీక్షలలో ఉత్తీర్ణులయినవారికి పండితసన్మానమునకై రూ 1,000 లున్ను, గౌతమీ విద్యాపీఠము వారు రూ 8 వేల రూపాయలు ఖర్చుపెట్టిరి.

### విరాళములు

శ్రీయుతులు పెనుమత్స సుబ్బరాజుగారు గౌతమీ విద్యాపీఠమునకు రూ 500 లును, కొనుమూరి వెంకటరత్నంగారు రూ 200 లను మేడేపల్లి సీతారామమ్మ జాకెళ్ళ సుశీలమ్మగార్లు రూ 800 లు గోపాలపురం వాస్తవ్యులగు వీరఘంటం లక్ష్మీనరసింహమూర్తిగారు రూ 116 లును విరాళము లొసంగిరి.

## కీ. శే. చేపూరి రాంబాయమ్మ గారు

ఇల్లెందు, సెప్టెంబరు 10: గత ఆగస్టు 15 వ తేదీన, సత్యాగ్రహంచేసి, వరంగల్లు సెంట్రల్ జేలులో నిర్బంధింపబడిన ఇల్లెందుతాలూకా కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ చేపూరి వెంకన్నగారి ధర్మపత్ని శ్రీమతి రాంబాయమ్మ మొన్నటిరాత్రి దివంగతురాలైంది. సుమారు రెండువందలమంది పట్టణవాసులు ఆమెగారి అంత్యక్రియలలో పాల్గొని, ఆమె ఆత్మశాంతికై ప్రార్థనలు సలిపారు. శ్రీగోపు ఆదినారాయణగుప్త గారు శ్రీ చేపూరి వెంకన్నగారి పట్లసాను భూతిని వెల్లడిస్తూ, వారిత్యాగాన్ని అర్థంచేసుకుని, స్టేట్ కాంగ్రెస్ పోరాటంలో పాల్గొనవలెనని ప్రజలను హెచ్చరించిరి.

# సంస్థాన ప్రజాపోరాటానికి స్వచ్ఛంద సేవకులు

చెన్నపురం, సెప్టెంబరు 10: ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ సూరపనేని రామశేషగిరిరావుగారీ క్రింది ప్రకటన చేయుచున్నారు.

సంస్థాన ప్రజాపోరాటములలో స్వచ్ఛందసేవకులుగా పని చేయుటకు 70 మంది తమఅనుమతిని తెలియబరిచిరి. ఈ యువకులకు శిక్షణ నిమిత్తం ఒక శిబిరమును ఏర్పాటు చేయదలచితిమి. ఒకపక్షముగో జాలు శిక్షణ మీయబడును. ఆశిబిరము ఎప్పటినుండి ప్రారంభమగుబడునో పత్రికాముఖమున తెలియజేయబడును. ఇంకను, స్వచ్ఛంద సేవచేయ కుతూహల పడు యువకులు, రాష్ట్రయువజనకాంగ్రెస్ కార్యాలయం, కాంగ్రెసు ఆఫీసువీధి, అరండల్ పేట, బెజవాడ; చిరునామాకు జాబువ్రాయవలసినదని కోరుచున్నాను.

## మదాసు విశ్వవిద్యాలయ పట్టప్రదానోత్సవం

చెన్నపురి, సెప్టెంబరు 16: మద్రాసు విశ్వ విద్యాలయ పట్ట పరీక్షలలో బి. యల్. యల్. టి. యం. ఏ, బి. టి. మినహా మిగతా వానిలో కృతార్థులైన వారికీ పారితోషికములకు అర్హులైన వారికీ అక్టోబరు 6 వ తేదీ మధ్యాహ్నం 4-30 గంటలకు పట్టప్రదానోత్సవం జరుగును. తత్తరులకు 1945 డిసెంబరు పట్ట పరీక్షలలో కృతార్థులైన వారికి అక్టోబరు 7 వ తేదీ మధ్యాహ్నం 4-30 గంటలకు పట్టప్రదానోత్సవం జరుగును.

# మిస్ మాలిని

## [శ్రీ ఆర్. కె. నారాయన్]

మాలినికి అంతా అంధకారంగా కనబడుతూ వుంది. ముసలి తండ్రి మంచం పట్టాడు. ఆమె అబల. వొంటరిగా యేమి చేయగలదు?



మాలిని

మాలినిది నిరాధారమైన మధ్యతరగతి కుటుంబము. ఆమెకు సహాయం యెక్కడనుంచి వస్తుంది?—కాని మాలిని చెలికత్తె, సుందరి మాత్రం ఆమెతో పాటు విచారించేది; ధైర్యం చెప్పేది. "మనకు సహాయం లేదనుకోరాదు, మనకు దేవుడే సహాయం" అంటూ ప్రోత్సహించేది.

ఏవిధంగానయినా మాలినికి కొంత ఆధారం యేర్పడాలి అని సుందరి యోచన. అందుకల్ల తాను యే కళామందిరంలో పని చేస్తుందో అదే కళామందిరం దర్శకుని వద్దకు తీసికొనివెళ్ళ నిశ్చయించింది.

కాని మాలినికి మాత్రం విశ్వాసం లేదు.

"లేదు మాలినీ, నీవు పొరబడుతున్నావు. నీకేమిటి కొరత? - కన్ను తీరువుంది; ముక్కు తీరువుంది; దేవుడు యిచ్చిన కంఠంవుంది రా, వెళ్దాం" అంటూ ప్రోత్సహించింది.

దర్శకుని ప్రశ్నలకు సమాధానం యివ్వడమెలాగో తెలియక, మాలిని తడబడుతూ వుంటే సుందరియే వకీలుగా అన్నింటికీ అనుకూలముగా సమాధానము ఇస్తూవుండడము చూచి దర్శకుడు చికాకుచెందాడు. దర్శకుడు మాలినిని శాంతంగా ప్రశ్నించి ఏదైనా వొకపాట వినిపించమన్నాడు.

మాలిని భక్తి ప్రధానమైన కృతి పాడింది. గాత్రముయొక్క నిండుదనము, పదాల ఉచ్చారణలోని మాధుర్యము దర్శకునకు విశ్వాసం కలిగించాయి.

మానవసేవకు నాటక కళ వొక ఉత్తమ సాధనగా భావించే దర్శకుడు అధునాతన జీవవాహినులమీద ఆధారపడిన ఉత్తమ వ్యంగ్యప్రచార నాటికలనే తీసికొని ప్రదర్శిస్తూ వుండేవాడు.

మాలిని రాకతో - రేషన్ విధానము, దొంగ బజారు, కంట్రోళ్లు, మున్నగు సమస్యలమీద వ్యంగ్యనాటికలు ప్రదర్శింప సమకట్టాడు. ఆనాటికలలో మాలిని ప్రముఖ పాత్రలు నిర్వహించేది. మంచి శిక్షణ పొందిన



సంపత్

మాలిని అభినయానికి నర్తనకు ప్రేక్షకజనం పరమోత్సాహితులయ్యారు. దానితో కళామందిరం నాటకాలంటే ప్రజలు విరుగబడుతు పరిపాటియైనది. కళామందిరం వృద్ధి కావడంతో,- కళయే వొక నిష్ఠగా నైతిని కృషిచేసి దలచే అనేక సామాన్యకుటుంబములకు గౌరవ జీవనం గడపే అవకాశం కల్పిస్తూ వచ్చాడు.

అదే మహానగరంలో సంపత్తు అనే యువకుడు కమీషన్ యేజన్సీ ప్రారంభించాడు: ఐతే ఆతనిది ఆదినుంచీ వక్రమార్గమే. ఇంటి అద్దెమొదలు కాఫీ హోటలు మేత వరకూ అన్నివైపులా అప్పులు చేసి బ్రతుకుచున్నాడు.

ఏవా ప్రపంచం అతి విశాలమైనదనీ, తన వంచనాశక్తి పరుసుగా వున్నంతవరకూ జీవయాత్ర యేదోవొక రూపంలో సాగింపడానికి అవకాశం వుండియే తీరుతుందనీ ఆతని విశ్వాసం.

ఒకనాడు సంపత్తు కళామందిరం ప్రవేశించి, మాలినితో పరిచయమున్నట్లు నటించనారంభిస్తే దర్శకుడు వారించి పంపివేశాడు. కాని అంతతోనే వంచకుడు సంపత్తు ఊరుకుంటాడా?

ఆ నగరంలో సమయోచితం అనే లక్షాధికారి గేవర చక్రవర్తి వున్నాడు. ఏ విధంగా నయితేనేమి యెంతో కష్టపడ్డుకొనియైతే నేమి సమయోచితం చాలా ధనం ఆర్జించాడు. ఇంతధనం గడించిన తరువాత చిరకాలంగా వున్న తనకోరిక తీరడానికి యేమిటి ఆటంకం? - తాను మునిసిపలు సభ్యుడై, చెయిర్మన్ కావాలి. ఈ రెండు ఆశలూ తీరడం యెలాగు?



డైరెక్టర్

సమయోచితం ఆశలను సంపత్తు పసికట్టకుండా వుంటాడా? అతను పసికట్టనూ కట్టాడు. సమయోచితం సంపత్తు సహాయం అర్థించనూ అర్థించాడు. మాలినితో పరిచయంచేసికొనుటకు ఇది వొక అవకాశమని కూడా సంపత్తు గుర్తించాడు.

సమయోచితం ఎన్నికల సందర్భంలో సంపత్తు సేనీటివింగు యేర్పాటుచేసి ఆ వింకునకు దర్శకుడుకూడా వస్తున్నాడని మభ్యపెట్టి మాలినిని ఆహ్వానించాడు. విందులో ఫోటోతీయించి పత్రికలలో వేయించి యీ సమయంలో సమయోచితని చైర్మన్ పదవికి చాలా అర్హుడని మాలిని ఉపన్యసించినట్లుగా ప్రకటింపజేశాడు.

మోసం అర్థమైనదని దర్శకుడు గ్రహించాడు మాలినికి హెచ్చరిక చేశాడు.

మొన్నాడు సంపత్తువచ్చినప్పుడు మాలిని "నా కెప్పుడు స్త్రీల కేదో వివరించి" వాదించింది. కాని సంపత్తు అంతతోనే వదలివేస్తాడా? అతనికి యెన్నో ఆశలు, యెంతో పెద్దపనీ పేరూ ప్రఖ్యాతీ పెరిగితే తనవెనకాటలు సాగవు; అందుకని యీ అటంకాలన్నీ సృష్టిస్తున్నాడు" అని నూరిపోశాడు.

సంపత్తు పాచిక పారింది. నాటినుంచీ మాలిని కళామందిరమునుంచి తప్పుకున్నది. ఇప్పుడు సంపత్తుకు మంచి అవకాశం. డబ్బుతో ప్రత్యేకంగా ఒక నాటకకంపెనీ ఆరంభించాడు. తాను మేనేజరుస్థానం ఆక్రమించాడు. ప్రజాభిమానం చూరగొన్న ఒక నటి, ఆమెధనం, తనకు మేనేజరు పదవి,- యిక కావలసిందేమి? మాలిని ధనాన్ని మంచినీటిప్రాయంగా ఖర్చు చేయించాడు. ఆమెకు యెరుకలేకుండా ఆమె పేరిట అప్పులుచేస్తూవచ్చాడు.

అప్పులవాళ్లు యెంతకాలమని వూరుకుంటారు? చివరకు డిక్రీలుపొంది అవకాశం కొరకు కనిపెట్టుకొని వున్నారు.



సుందరి

ఒక నాటి సాయంత్రం మాలిని నాటక ప్రదర్శనం. అది పురాణ నాటకమైన "అల్లిరాణి." రాణిగా రంగస్థలం మీద కు మాలినివచ్చింది. అప్పులవాళ్లకు అదే మంచి అవకాశం! 'అటాచ్‌మెంట్'తో 'బెయిలిఫ్' రంగస్థలం మీదకు తయారయాడు!

తానున్న ప్రమాదావస్థను మాలిని అప్పుడుగ్రహించింది. దీనికంతటకు కారణం యీ సంపత్తుని నమ్మటే అనిగ్రహించింది. అప్పులవాళ్లు నానామాటలూ అడుతూ వుంటే, సంపత్తు ముందుకువచ్చి 'దివాలా ప్రకటించవలసిందని' అతి సునాయాసంగా సలహాయిచ్చాడు.

మాలిని మానవతి. ఆమె మరి భరింపలేకపోయింది. ఆ దురాగ్రహి తననుకుంచిన నిల్లిపొమ్మన్నది. అప్పులవారందరిని పిలిచి తన యావత్తు ఆస్తి అమ్మియైనా వారి దమ్మిడీలతో సహా ముట్టజెప్ప వలసినదియంతా ముట్టచెవ్వగలనని వాగ్దానం చేసింది.

మాట ప్రకారం మాలిని సర్వమూ అమ్మివేసింది. అప్పులు తీర్చివేసింది. కట్టుబట్టలతో, ముసలితండ్రితో మాలిని బయట పడ్డది.

ఆ దయనీయావస్థలో సుందరి తోటా రునా తారసిల్లింది. కాని మాలిని - పొంగివచ్చే దుఃఖంతో,- గుండె నిండిన ఆవమానభారంతో సుందరిని చూడలేకపోయింది "మాలినీ, నీ కెక్కడ నేమున్నది? రా, నాతో; మన యిద్దరమూ కష్టసుఖాలనే పంచుకుందాం" అంటూ ప్రేమతో ఆహ్వానించింది సుందరి.

కాని మాలినికి మొగము చెల్లలేదు. "ముందివరకు నా హితవుగోరి నీవు యెంత చెప్పినా నీమాట వినలేదు కదా" అంటూ వెక్కి వెక్కి యేడ్చింది.

"నీవు వినకపోయినా నీవు నా మాలినివే; నా చెలికత్తెవే" అంటూ సుందరి మాలినిని చెంతకు తీసుకున్నది.



"నన్ను వృద్ధికి తీసుకువచ్చిన డైరెక్టరు గారినీ త్యజించాను. వారిని అవమానించాను. వారికి యెంత కష్టంగా - యెంత కోపంగా వుండో గదా అని తలచుకుంటేనే నా హృదయం వేస్తున్నది" అంటూ వలవల విలపించింది మాలిని.

సమయోచితం

సమాధానంగా సుందరి పకపకా నవ్వింది. "అక్కడే నీవు యింకా వెర్రిలో పడుతున్నది! అసలు నీవద్దకు నన్ను పంపిన దెవరనుకున్నావ్? ఆయనే!" అని సుందరి చెప్పివేసింది.

మాలినికి మరేమీతోచలేదు. ఆమెలో నైతిక్యం సంభించిపోయింది. ఆ యువస్థలో యెవ్వరికైనా అంతటి క్షమాహృదయం వుంటుందంటే ఆమె విశ్వసించలేదు.

ఐతే నిజంగా దర్శకునిహృదయం అంత ఉదారమైనది. ఆయన సమాజహితాన్ని కాంచి కళాప్రచారం చేస్తున్నాడే కాని యేదోవొకరకం ప్రదర్శనలు యేర్పరచి ధనం ఆర్జించుటకు సిద్ధపడలేదు. ఆయన సహజ సేవానిరతుడు. ఆయనది ఉదారహృదయం. ఆటువంటి మహావ్యక్తి తిరుగా మాలినికి చేయూతనీయకుండా వుంటాడా?

[ఇది జెమిని చిత్రంయొక్క సంక్షిప్త కథ. రామనాథ్ నిర్మాణం. ఆంధ్రదేశం అంతటా త్వరలో విడుదల. ఇందు నటించినవారు పుష్పవల్లి, సుందరిబాయ్, కొత్తమంగలం సుబ్బు, నారాయణరావు మున్నగువారు.]



# నిజాం కాంగ్రెస్ ఉద్యమం
## ప్రొద్దుటూరులో పోలీసు కాల్పులు

ఒకని మరణం: ముగ్గురికి గాయాలు

బెజవాడ, సెప్టెంబర్ 15. వరంగల్లు జిల్లా ఖమ్మంమెట్టు తాలూకా ప్రొద్దుటూరులో పోలీసులు కాల్పులు జరిపినందువల్ల ఒకరు మరణించినట్లూ, ఇద్దరు పురుషులూ, ఒక స్త్రీ తీవ్రంగా గాయపడ్డట్లూ తెలిసింది.

కాల్పులు జరిగినప్పుడు అక్కడఉన్న ఒకరు నాతో ఈ సంఘటన గురించి ఈ వివరాలు తెలిపారు. 13 వ తేదీ ఉదయం తూటుకూట్ల గ్రామకరణం కె. వెంకటప్ప గారిమార్గదర్శకత్వాన చింతకాని సర్కిల్ సబిన్‌స్పెక్టర్లు 40మంది రిజర్వుపోలీసులతో పొద్దుటూరు ముట్టడించారు. అపుడు యానికి గ్రామస్థులంతా తమపనిపాటులకు వెళ్ళారు.

ఇంతకు ముందు 4వ తేదీ రాత్రిఒకసారి, 9వ తేదీసాయంత్రం ఒకసారి,పోలీసులు ఆగ్రామంమీదికి పోయి కొంతమంది కాంగ్రెస్ వాదుల ఇండ్లుసోదాచేశారు. అబ్కారీ శాసనాన్ని ఉల్లంఘించి చెట్లను కొట్టివేసి, వాటిపైన భారతజాతీయ పతాకాలను ఎవరు ఎగురవేసిందెవరో తెలుపవలసిందని గ్రామస్థులను అడిగి ఒక్కొక్క ఇంటినుంచి రూ. 5 లు బలవంతంగా వసూలు చేశారు.

ఈ సారి పోలీసులు రైతుల ఇండ్లతలుపులు బ్రద్దలుకొట్టి వారికున్న కొద్దిపాటి ఆహారధాన్యాలనూ, కోళ్లనూ, మేకలనూ, గొర్రెలనూ స్వాధీనం చేసుకొన్నారు. ఇళ్లల్లో ఉన్న అపహాయులైన స్త్రీలను లాఠీలతో, తుపాకి మడమలతో కీళ్ల మీద కొట్టి, దుర్భాషలాడారు. ఇదంతా తెలిసి, 80 మంది గ్రామస్థులు చుట్టుపట్లనున్న గోవిందపురం, లక్ష్మీపురం, తూటుకొట్ల మొదలైన గ్రామాలవారితో కలిసి, గ్రామంలోకి వస్తూండగా, పోలీసులు ఆ సమూహాన్ని చెదరగొట్టేందుకు కాల్పులు ప్రారంభించారు. ప్రజలు పారిపోకుండా నిలబడి పోలీసులపై రాళ్లు రువ్వ నారంభించారు. ఈ కొట్లాట రెండుగంటలసేపు జరిగింది. కాల్పులవల్ల కుడుము ముత్తయ్య చనిపోయారు. ఒక స్త్రీ తన మామగారిని కాపాడబోగా తుపాకిగుండు ఆమె తొడలోనుంచి దూసుకు పోయింది. మరొక గొల్లవానికి చేతులమీద గాయాలయినాయి. ముందూ వెనకా అన్నది లేకుండా జరిగిన కాల్పులఫలితంగా సమూహం చెదరిపోయింది. ముగ్గురిని అరెస్టుచేసి సంకెళ్ళువేసి చింతకాని తీసుకుపోయారు.

## వే॥ భాస్కరరావుగారి అరెస్టు

సూర్యాపేట, సెప్టెంబరు 12: నిజాం సంస్థాన ఆంధ్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి, కిసాన్ మజ్దూర్ ప్రజా పక్షం ఆ ప్రాంత కార్యదర్శి శ్రీ వేములపల్లి భాస్కరరావుగారిని వారి స్వగ్రామం టీవీ గూడెంలో నిన్నను అరెస్టు చేశారు. వారిని నల్లగొండ జైలుకు తీసుకువెళ్లారు.

అరెస్టుకుముందు శ్రీ భాస్కరరావుగారు ప్రజలకీ సందేశం ఇచ్చారు: ప్రజలంతా కాంగ్రెస్ ఆదేశానుసారం శాంతి సమరం సాగించాలి. ముఖ్యంగా రైతు లోకం ధైర్య సాహసాలతో, పాల్గొని ఉద్యమం ఫలప్రదమయేట్లు చూడాలనీ, బాధ్యతాయుత ప్రభుత్వం, రైతు కూలీ ప్రజారాజ్య స్థాపన అయిననాడే రైతుకు మోక్షమనీ తెలుపుతున్నాను. రైతులు భూమిని దున్నినట్లు అత్యంత శ్రద్ధా భక్తులతో, విశ్వాసంతో ఈ ఉద్యమాన్ని కొనసాగించ కోరుతూ సెలవుతీసుకొంటున్నాను.

### గ్రామస్థుని నిర్బంధం

ఓరుగల్లు, సెప్టెంబరు 12: యీరోజు గండిశాల అనంతరాములు అను కరీమాబాద్ నివాసి. భారత స్త్రీలోని రాణా ముందునుంచి వెళ్లుచుండగా పోలీసు జమేదారుగారు తీసుకువెళ్లి నిర్బంధించినారు. కొంతసేపటికి అనంతరాములు తండ్రికి విషయము తెలిసి వచ్చి ఆ మీనా గారి ముందు మొరపెట్టుకుంటే, ఓరుగల్లులో జరిగిన హత్యాకాండ సందర్భమున అనుమానించి అరెస్టు చేసినామనీ, 500 రూపాయలు రొక్కపు జామీనాయిస్తే కేసు నిర్ధారణ అగువరకు వదలుతామనీ సెలవిచ్చినారు.

### అరెస్టులు-నిర్బంధాలు

సంస్థాన కాంగ్రెస్ కార్యాలయ కార్యదర్శి ఈ దిగువ ప్రకటన చేశారు: వనపర్తి రోడ్డులో కె. దశరథయ్య, బలరామగౌడు, నారిగాడి సుబ్బన్న, కొశెట్టి కృష్ణయ్య గార్లను పోలీసులు అరెస్టుచేసి, నిర్బంధంలో వుంచారు. మానుగడ్డ గ్రామంలో దామోదర పాటిల్, హనుమంతరావు పాటిల్, మరి 12మంది భారత పతాకాలు ఆవిష్కరించి, వందనాలు చేశారు. పోలీ

సులు వారిని అరెస్టుచేసి లటూర్ జైలుకు పంపారు. ముగాన్ గ్రామంలో నానారావు, పట్వారీ, మనోహర్ గార్లను అరెస్టుచేసి బీదర్ జైలుకుపంపారు. కోరం శ్రీ గోవిందరావు, విశ్వనాథరావు గార్లు సత్యాగ్రహం చేసి అరెస్టుచేశారు. దేవల్‌గంజ్, కళస్, సాలెక్, బెలగాం, హాతల్, కేద్రా గ్రామ ప్రజలు 5 వేల సైదీలకు తాడిచెట్లు కొట్టివేశారు. సెలు గ్రామంలో ఆదినారాయణ, తుకారాం, వహాబ్ మరి 11 మంది సత్యాగ్రహం చేయగా, అరెస్టుచేసి, ఒక్కొక్కరికి 18 మాసాలు కఠిన శిక్ష విధించారు.

ఫత్నీలో 14 వ తేదీన పోలీసులకు కనబడకుండా తప్పించుకు పోయిన సదాశివరావు సావర్కే గాంకర్ గారు మధ్యాహ్నము తమంతటతామే పోలీసులకు స్వాధీన మయ్యారు. డిటెన్యూ నందరిని పోలీసులు ఔరంగాబాదుకు తీసుకువెళ్లారు. గురుందాలో బాంగోజీ, చిదేవన్ మరి నలుగురు సత్యాగ్రహంచేసి అరెస్టు అయినారు.

### అరబ్బుల ఊరేగింపు

హైదరాబాద్, సికిందరాబాద్ నగరాలలో 15 న మూడు రైల్వే బస్సులనిండా సాయుధ అరబ్బులు గాలిలోకి తుపాకులు పేలుస్తూ, నినాదాలుచేసూ ఊరేగారు. ఈ కొత్త ప్రదర్శనం పోలీసు అధికారులనే ఆశ్చర్యపరిచింది.

సికిందరాబాద్‌లోని మహబూబ్ నగర్ కాలేజి విద్యార్థుల సమ్మె వద్దరా ప్రదర్శనాలలో పోలీసులు 14 మంది విద్యార్థులను అరెస్టుచేశారు. విద్యార్థులు ఒకచో పోలీసులపై రాళ్లురువ్వారు. కాంగ్రెస్ నాయకుడు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు విద్యాలయ అధికారుల అనుమతితో, శాంతియుతంగా ప్రవర్తించవలెనని విద్యార్థులకు విజ్ఞప్తి చేశారు. వారి సలహా ఫలితం కనిపించింది. ఆ తర్వాత మరికొందరు విద్యార్థులు అరెస్టు కావడానికి ముందుకు వచ్చారు. జిల్లా మేజస్ట్రేటు విద్యార్థుల నందరినీ విచారణ చేసి వెంటనే ముందటి అరెస్టు అయిన 6 గురిని మినహా మిగతా వారందరినీ హెచ్చరిక చేసి వదిలిపెట్టారు. ఆ ఆరుగురికీ ఒక్కొక్కరికి 15 రూపాయలు జరిమానా విధించారు. జరిమానా చెల్లించేందుకు వారం రోజులు గడువిచ్చారు. ఒకచోట ఒక పోలీసు విద్యార్థులను లాఠీలతో ఎక్కుస్తూ వారిలో ఒకరిని తన్నాడని తెలిసింది. రామకృష్ణరావు గారు ఈ విషయం అసిస్టెంటు పోలీసు కమీషనరు చలమారెడ్డి గారికి తెలియచేయగా కనుక్కుంటామన్నారు.

### కాంగ్రెస్ కార్యకర్త అరెస్టు

మహబూబునగరం తాలూకా కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీకొండపల్లి లక్ష్మీనర్సింహారావుగారిని, కొండపల్లి శేషగిరిరావు గారిని పోలీసులు అరెస్టుచేసినారు. వీరు మహబూబునగరపు పట్టణవీధుల్లో, భారత యూనియన్ పతాకాలను చేతపుచ్చుకొని సత్యాగ్రహంచేసినారు.

ఈ తాలూకాలోని నల్లబండగూడెం, చీమలేల, గోండ్రేలపెండలకు గ్రామాలలో ఎగురవేయబడిన యూనియన్ పతాకాలను రిజర్వుపోలీసులు వెళ్లితీసివేసినారు.

### విద్యార్థుల అరెస్టులు

భువనగిరి హైస్కూలు విద్యార్థులు సెప్టెంబరు 8 వ తేదీన శాంతియుతంగా సమ్మెసాగించినారు. ఆరోజు (వి. నర్సింహారెడ్డి టి. నర్సింహారెడ్డి అను ఇద్దరు విద్యార్థులు ప్రభుత్వనిషేధాజ్ఞలను ఉల్లంఘిస్తూ సత్యాగ్రహంచేసినారు. పోలీసులు ఇద్దరిని నిర్బంధించిరి.

ఆరోజు, భువనగిరి కోటపైనను, హైస్కూలు భవనంపైనను విద్యార్థులు యూనియన్ పతాకాలను ఎగురవేయగా, ముస్లింగుండాలు వాటిని తీసివేసిరి. భువనగిరిలో 15 సెప్టెంబరువరకు 145 సెక్షన్ సాగించిరి.

## ఓరుగల్లు జైలులో నిరశనవ్రతము

ఓరుగల్లు, సెప్టెంబర్ 13: యీనెల 6 వ తేదీన స్థానిక జైలులోని రాజకీయ ఖైదీల నిరశనవ్రతము ఫలితంగా జైలు మొహిమిన్ గారు జోక్యం కల్గించుకొని వారం రోజులలో ఖైదీల కోర్కెలకు సరిఅయిన సంతృప్తికర సమాధానములు యిప్పించెదనని తెలిపియుండిరి. ఖైదీలు కూడా 13 వ తేదీలోగా సమాధానం రాకుంటే నిరశనం చేస్తామనిరి. నిశ్చయం ప్రకారం 13 వ తేదీనుండి సర్దార్ జమలాపురం కేశవరావుగారి నాయకత్వాన 700 మంది ఖైదీలు నిరశన వ్రతం ప్రారంభించారు. కమ్యూనిస్టు నాయకుడు శ్రీ బద్దికొండ అప్పారుస్వామిగారు కూడా ఈ వ్రతంలో పాల్గొంటున్నారు.

యీ రోజు "జన్మభూమి" అమ్మినందుకు వెంకటనర్సయ్య అను వానిని సాయంకాలం గం 6 లకు అరెస్టుచేసి జామీనుపై విడచినారు.

### హుజూరాబాదు ఖైదీలు

హుజూరాబాదులో బలమయిన గాయములు తగిలి ఆసుపత్రిలో నుంచినవారిలో 41 గేరు 50 నుంచి ఖైదీలను యీ రోజు జైలుకు పంపినారు. గాయపడి ఆసుపత్రిలోనున్నవారికి తగిన సౌకర్యములు లేనందునను, రామకిషన్‌రావు కొండా వెంకటరంగారెడ్డిగార్లకు గాయపడినవారి సంఖ్యను తగ్గించి చూపుటకును ప్రభుత్వ మీనా యేర్పాటుచేసినట్లు తెలిసింది. జైలుకు తెచ్చిన ఖైదీలకు మలమూత్రవిసర్జనకుకూడా వీలుయివ్వుటలేదనీ, గాయపడినవారికి కట్లుకట్టుటకు కాంపౌండర్లు కూడా లేరనీ తెలిసింది. (స్వ. వి)

### భారతపతాక ఎగురవేసిన వారికి శిక్షలు

మెదకుజిల్లా, సంగారెడ్డిలో, సెప్టెంబరు 2 తేదీన యూనియన్ పతాకాన్ని ఎగురవేసినందుకు నిర్బంధింపబడిన మహంకాళి నారాయణ, శివాజి, రాములు, మల్లప్ప, వీరకుమార్ మొదలగు 5 గురు కాంగ్రెస్ కార్యకర్తలయిన ప్రతిఒకరికి, ఒక నెల కఠినశిక్షయు, శంకరయ్య, రామకిష్టయ్య, హన్మయ్య, వెంకయ్య, రాఘవాచారి, లక్ష్మయ్య, వీరారెడ్డి, విజయసింహ, శరణప్ప మొదలగు 9 మంది కార్యకర్తలలో ప్రతిఒకరికి పది దినముల కఠినశిక్షయు విధించినారు. సంగారెడ్డి ఎగురవేయబడిన పతాకాన్ని పోలీసులు తీసివేసినారు.

### గద్వాల

గద్వాల, సెప్టెంబరు 10: మహబూబునగరంజిల్లాలోని గద్వాలలో, సెప్టెంబరు 2 వ తేదీన, యూనియన్ పతాకాలను ఎగురవేసినందుకు నిర్బంధింపబడిన 11 మంది కార్యకర్తలకు ప్రతిఒకరికి కోర్టువారు ఏడుమాసాల చొప్పున కఠినశిక్ష విధించినారు. ఈ కార్యకర్తలలో ఎక్కువమంది విద్యార్థులే. అందరికన్న చిన్నవిద్యార్థి నల్లారెడ్డిని అధికారులు విడుదల చేస్తామంటే, అందరిని విడుదల చేస్తేనే నేను వెళుతాననీ, లేకుంటే అందరితోపాటు నేను అనుభవిస్తానని ధైర్యంగా చెప్పారు. ఈ సత్యాగ్రహులను, రాత్రి యెవరికీ తెలియకుండా రాయచూరు తీసుకవెళ్లినారు.

మహబూబునగరుజిల్లాలోని నారాయణపేట మున్నపుకోర్టువారు, స్టేటుకాంగ్రెస్ సత్యాగ్రహంలో పాల్గొన్న రామచంద్రరావు మహేంద్రకర్, శయ్యన్నథంగ్డే, రాములు మాస్టర్, రాజయ్య మస్త్రా, నర్సింగ సర్వేరగార్లను విచారించి, ప్రతిఒకరికి ఒక సంవత్సరపు కఠినశిక్షను విధిస్తూ తీర్పు చెప్పినారు. వీరు, మహబూబునగరం జైలుకు పంపించబడినారు.

# "స్వాతంత్ర్యోద్యమ సఫలతకు ప్రజలందరూ సహాయపడాలి"

## నిజాం ప్రజలకు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారి విజ్ఞప్తి

### ముషీరాబాద్ ప్రజలపై లాఠీఛార్జీ: పాతికమందికి గాయాలు

హైదరాబాదు, సెప్టెంబరు 16: ముషీరాబాదు పారిశ్రామిక ప్రాంతములో చేరిన ప్రజాసమూహముపై నిజాం పోలీసులు జరిపిన లాఠీఛార్జీలో దాదాపు పాతికమంది గాయపడినట్లు తెలియుచున్నది. ప్రముఖ కాంగ్రెసు నాయకుడును, కిసాన్ మజ్దూరు ప్రజాపక్ష కార్యదర్శియునైన శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారి ఉపన్యాసమును వినుటకు ప్రజలు ఇచట చేరిరి. బహిరంగ సభల నిషేధపుటుత్తరువుల నుల్లంఘించి నేటి సాయంత్రి మీ ప్రాంతమున శ్రీ రామకృష్ణరావుగారు ఉపన్యాసం చేయుదురని ముందుగనే ప్రకటింపబడియుండెను. అందువల్ల నేడు ముషీరాబాదు ప్రాంతమందలి కర్మాగారము లన్నింటిని మూసివేసిరి. ఈ మిల్లులలో పనిచేయు కార్మికులు యావన్మంది సభాస్థలికి మూగిరి.

రామకృష్ణరావుగారు, జాతీయ జనసభ అధ్యక్షుడు రామమూర్తి నాయుడుగారు, శివలింగప్పగారు, లక్ష్మణరావుగారు, గురులింగప్పగారు సరిగ్గా నిర్ణయమైన సమయమునకు సభ జరుగు ప్రదేశమును చేరిరి. అప్పటికే ప్రజలు, పోలీసులువచ్చియుండిరి. పోలీసువారు రామకృష్ణరావుగారిని, ఇతర నాయకులను వెంటనే అరెస్టుచేసిరి. అచట చేరిన ప్రజాసమూహముపై లాఠీచార్జీచేసి చెదరగొట్టిరి. ఈ లాఠీచార్జీలో దాదాపు పాతికమంది గాయపడినట్లు తెలిసినది.

ఢిల్లీ హిందుస్తాన్ టైమ్సు పత్రికవిలేఖరి యల్. డి. నటరాజన్‌గారు తాను పత్రికావిలేఖరి నని చెప్పుకొన్నప్పటికిని పోలీసువారు వారిని వెంటబడి తరిమి లాఠీలతో కొట్టిరి.

నృపతుంగపాఠశాల విద్యార్థులు నేడు ఊరేగింపు ప్రదర్శనలు జరుపుచుండగ పోలీసువారు విద్యార్థి బృందముపై లాఠీచార్జి చేసిరి. ఈలాఠీచార్జీ సుల్తాన్‌బజారు సమీపములో జరిగినట్లు, పన్నెండుమంది విద్యార్థులను పోలీసువారు కొంతకాలం తమ ఆదుపులో ఉంచి వదలివేసినట్లును సంస్థాన కాంగ్రెస్ వారివాడు జారీచేసిన బులెటిన్ వల్ల తెలియుచున్నది.

## శ్రీ రామకృష్ణరావు సందేశము

పోలీసువారు అరెస్టు చేయుటకు పూర్వము బూర్గుల రామకృష్ణరావుగారీ క్రింది సందేశము నొసగిరి.

"హైదరాబాదు ప్రజలు సాగించుచున్న ఉద్యమ లక్ష్యములు రెండు. ఒకటి నిజాం సంస్థానము ఇండియా యూనియన్‌లో చేరునట్లు చేయుట; రెండు సంస్థానమున బాధ్యతాయుత ప్రజాప్రభుత్వమును సాధించుట. ఈ లక్ష్యద్వయమును పొందువరకు పోరాటమును సాగించుటకవసరమైన ఉత్సాహము, ధైర్యము, క్రమశిక్షణ సంస్థాన ప్రజలకు ఉండగలదని నే నాశించుచుంటిని. సంస్థానమున శాంతి నెలకొల్పుటలోను సంస్థానమును సౌభాగ్యవంతము చేయుటలోను ప్రజల సంపూర్ణ ఐచ్ఛిక సహకారమును పొందుటకు ప్రయత్నించుటకు బదులు సంస్థాన ప్రభుత్వము ప్రజలతో బలాబలములు తేల్చుకొనుటకు పూనుకొనుట విచారకరము. అంతేగాదు, ప్రభుత్వమువారు ఇత్తేహాదుల్ ముస్లిమీన్‌కు ఇంతమించు అధికారము దఖలుపరచినది. ఈ పరిస్థితులు నెవ్వెంటనే అంతము కావలెను. హైదరాబాద్ భవిష్యత్తును గురించి ఎక్కువ వాస్తవికదృష్టితో విచారింప వలసినదని భావ్యము హత్యలకు దారితీయుగల తమ ప్రస్తుతవిధానమును విరమింపవలసినదని ఇత్తేహాదుల్ ముస్లిమీన్ నాయకులను మనస్ఫూర్తిగా సవినయముగ విజ్ఞాపనము చేయుచుంటిని. ఇత్తేహాదుల్ ముస్లిమీన్ విధానముతో ఏకీభవింపని ముస్లింలు కొందరున్నారు. వీరు త్వరలోనే తమ వర్గక్షేమమును, సంస్థాన భవిష్యత్తును గమనించి ముందుకు రావలసియుండును. ప్రస్తుత పరిస్థితులలో సంస్థానమందలి కాంగ్రెస్‌వాదుల, ముస్లిమేతరుల బాధ్యత గురుతరమైనది. మత సంబంధములు విషమపరిణామములను పొందనివిధముగ, అతి జాగ్రత్తతో కాంగ్రెసువారు ఈ పోరాటమును సాగింపవలసియున్నది. ఉద్యమవిజయమును కాంక్షించువారందరు, ఈ ఉద్యమమును దౌర్జన్యమార్గముల నట్టింపరాదని, మతకలహములుగ చేయరాదని ఉద్యమ శత్రువుల చర్యలను వెయ్యికళ్లతో కనిపెట్టి వారి ప్రయత్నములు సఫలముకాకుండునట్లు ప్రతి కాంగ్రెస్‌వాది పనిచేయవలసియున్నది.

"ఈనాడు ఇత్తేహాదుల్ ముస్లిమీన్ నాయకులు అతిసంకుచిత (ప్రాతినిధ్య) విధాన

ముననుసరించుచుండిరి. తామే సంస్థాన సంరక్షకులమని భావించుచుండిరి కాని తమ విధానమువలన వారు సంస్థాన శాంతికి భద్రతకు ముప్పుతెచ్చి పెట్టుచుండిరి. కుదురు మన సమస్యలు వాస్తవిక దృష్టిని అనుసరించియే పరిష్కరింపబడవలసి యున్నవి. ఆ పరిష్కారము శాంతియుతముగనే జరుగవలసి యున్నది. మన లక్ష్యముల సాధించుట కదొక్కటే మార్గము. ప్రజాశక్తి, ప్రజాఐక్యము బలమును రుజువుచేయుటకదే సరియైన పద్ధతి. హైదరాబాద్ సంస్థాన ప్రజా ఉద్యమమునకు సర్వవిధముల సహాయపడవలసినదని ప్రజానీకమునకు విజ్ఞప్తి చేయుచున్నాము. మన ఉద్యమము అఖండ విజయమును పొందుగాక!"

హైదరాబాదు కు వచ్చుచున్న పుస్తకముల వార్తాపత్రికల పార్సిల్సును నిజాం కస్టమ్సు ఉద్యోగులు, చిరునామా దారులకు బట్వాడా చేయుటకు పూర్వము శోధన చేయుచున్నారు. నిషిద్ధ పత్రికలుగాని ఇతర వాఙ్మయముగాని రహస్యముగ సంస్థానములో కిరాకుండ నివారించుటకీ శోధన జరుగుచున్నట్లు తెలియుచున్నది. ఈమధ్యనే భారతదేశమునుండి వచ్చుచున్న అనేక పత్రికలను నిజాం ప్రభుత్వము నిషేధించి యున్నది.

## 'అరాజకం' అణిచేందుకు ప్రభుత్వ సన్నాహం

• నిజాం సంస్థానంలో అరాజకం, మతకలహాలూ చెలరేగకుండా నిరోధించేందుకు ప్రభుత్వం చర్యలు తలపెట్టింది. వాటిలో ఒకటి ఆయుధాలకూ, మందుగుండు సామానుకూ సంబంధించినది. ఈ విషయములో ప్రభుత్వం ఈనెల 8 తే ఒక ప్రకటన చేసింది. దానిప్రకారం సరియైన అధికారి ఎరుకలేకుండా ఎవ్వరూ ఆయుధాలు కలిగి వుండరాదు. వాటిని ఇతరులకు అమ్మరాదు, మరోవిధంగా అప్పచెప్పరాదు. అదేవిధంగా వీటిని ఎవరూ తయారుచేయరాదు, వ్యాపారం చేయరాదు. లైసెన్సుగల వ్యాపారస్థుడు లైసెన్సులేనివారికి వీటిని విక్రయించరాదు. ఎవ్వరూ బయటి ప్రాంతాలనుంచి వీటిని దిగుమతి చేయరాదు. ఈ ఉత్తరువును భిన్నంగా నడిచేవారు 5 ఏండ్లు కారాగారశిక్షకూ, లేక జరిమానాకూ, లేక రెండింటికీ పాత్రులవుతారు.

రెండవది శాంతిభద్రత రక్షణకు సంబంధించినట్టిది. ఈ విషయంలో ప్రభుత్వం 'కల్లోల ప్రాంతాల నిబంధన' అనే పేరుతో ఒక నిబంధనను అమలు చేయడం అవసరమన్న అభిప్రాయానికి వచ్చింది. ఈ నిబంధన ప్రకారం మతకల్లోలాలు ప్రజ్వలించి అశాంతి చెలరేగినప్పుడు స్థితిగతులను అదుపులోనికి తెచ్చేందుకు పోలీసులకూ, సైన్యానికీ విస్తారమైన అధికారాలుంటాయి. కాల్చిచంపే అధికారం కూడా ఉంటుంది. సైనికోద్యోగులు వారంటులేకుండా వ్యక్తులను అరెస్టు చేయవచ్చును, ఎవరి ఇళ్లలోకైనా వెళ్లి సోదా చేయవచ్చు. కల్లోల ప్రాంతాలలో వెంటవెంటనే విచారణ జరిపేందుకు ప్రత్యేక జడ్జీలను నియమిస్తారు.

అయితే ఈ నిబంధనను ఇంకా అమలు చేయలేదు. అమలు చేయవలసిన అవశ్యకత కలిగించవద్దని ప్రభుత్వం ప్రజలకు విజ్ఞప్తి చేసింది.

## కర్నాటక కాంగ్రెస్ అధ్యక్షుని ప్రకటన

కర్నాటకరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ జనార్దనరావు దేశాయిగారు ప్రకటన చేశారు. నిజాం సంస్థాన కాంగ్రెసు పోరాటం విజయోన్ముఖం అవుతోంది. ప్రభుత్వం ప్రకటించిన నిబంధన చూసి ప్రజలు కోపోద్రిక్తులు కారాదు. సత్యాగ్రహోద్యమం ప్రారంభమై నెలపైన కొద్దిరోజులే అయింది. ప్రభుత్వం అప్పుడే జంకుతోంది. అందుకనే పోలీస్ సబిన్స్పెక్టర్లకు కూడా కాల్పులు జరిపే అధికారం ఇస్తానంటోంది. ఈ దమననీతి ఉద్యమాన్ని అణచలేదు. పైగా ప్రజలలో ఉత్సాహం అతిశయించడానికీ, ఉద్యమం ఉద్వేగంగా జరగడానికీ దోహదమవుతుంది. ప్రజలకు నేను చెప్పదలచింది ఒకటే. ఏమిటంటే ప్రభుత్వం ప్రకటించిన నిబంధనచూసి కోపోద్రిక్తులు కాక, అహింసా మార్గాన పోరాటం సాగించాలి. సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గ సంఘం సూచించిన కార్యక్రమమే అనుసరించాలి. దానిని ఫలప్రదం చేయాలి.

### దేశముఖ్ దేశపాండ్యాలకు పటేల్ పట్వారీలకు విజ్ఞప్తి

నిజాం సంస్థాన ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టుపార్టీల నాయకులు రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, మక్దూం మొహియుద్దీన్‌గార్లు సంస్థానంలోని దేశముఖ్, దేశపాండ్యాలకూ, పటేల్ పట్వారీలకూ ఈ క్రింది విజ్ఞప్తి చేస్తున్నారు:

నేడు హైదరాబాదు సంస్థాన ప్రజలు నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ప్రజాస్వాతంత్ర్యంకొరకు పోరాటం జరుపుచున్నారు. నవాబు భారతయూనియన్‌లో చేరటను, బాధ్యతాయుత ప్రభుత్వాన్ని స్థాపించుటను, నిరాకరించి హైదరాబాదు సంస్థానంలోని, భారతదేశంలోని ప్రజాస్వామిక శక్తులపై యుద్ధం ప్రకటించాడు. ప్రజాపోరాటాన్ని రక పోలీసు మిలటరీబలగం, సాయుధగూండాలద్వారా అణచివేయుటకు పూనుకున్నారు. ఈదౌర్జన్యాలనుండి మీరు గూడా తప్పించుకోలేరు. వివిధప్రాంతాలలో మీ సోదర వతన్‌దార్లు, దేశముఖులు దౌర్జన్యాలు నీచమైన అవమానములకు గురిచేయబడుచున్నారు.

ఈ సంఘటన ఫలితంగా మీలో కలుగుచున్న పరివర్తనను మేము స్వాగత మిస్తున్నాము.

ఈపోరాటము జయప్రదంగా జరుపుటకై ఇతర ప్రజలందరితోపాటు మీరు గూడా మీ దేశభక్తియుత కర్తవ్యము నెరవేరుస్తూ, దీనిలో పాల్గొనవలయునని మేము విజ్ఞప్తి చేయుచున్నాము. రాష్ట్రప్రజాస్వామిక శక్తులలో మీరుగూడా ఒక భాగంగా ఉండాలెనని మేము కోరుచున్నాము.

ఇంతవరకు ఈ నిరంకుశ పరిపాలనా విధానములోను, దోపిడీలోను మీరు భాగస్వాములుగా నుండుటచే మిమ్ములను ప్రజలు అనుమానదృష్టితో చూస్తున్నారు. ఇది సహజమైన విషయమే. ఈనాడు ప్రజలు ఐక్యంగా సాగించే స్వాతంత్ర్య పోరాటంలో మీరు గూడా కలిసి పోరాడుట అవసరం. అందుచేత మీరు మీ గ్రామప్రజలతో ఐక్యత నెలకొల్పుకొని సమిష్టిశత్రువైన నైజాం ప్రభుత్వాన్ని ఎదుర్కోవాలి. నేడు ప్రజలు మిమ్ములను న్యాయమైన హక్కులను కోరుచున్నారు. వాటిని మీరు వెంటనే అంగీకరించి ఇదివరకు మీలో పలువురు సాగిస్తున్న అక్రమాలను దౌర్జన్యాలను వదులుకొని, ఇతర ప్రజలతోపాటు పోరాటములో పాల్గొని, ప్రజాస్వాతంత్ర్య సాధనకై తోడ్పడతారని ఆశిస్తున్నాము.

వ్యవసాయ కూలీలకు, జీతగాండ్రకు రోజుకు కనీసము మూడుసేర్ల గట్టిధాన్యము (జొన్నలు, సజ్జలు, బియ్యము మొదలగునవి) లభించాలి. వారినుండి రోజుకు పరిమితిగల గంటలు పనిమాత్రమే తీసికోవాలి. (8 లేక 10 గంటలకంటె పని ఎక్కువగా నుండగూడదు) సంవత్సరానికి కనీసం 80 రోజులు సెలవు జీతంతో లభించాలి.

వెట్టిచాకిరి అక్రమవసూళ్లు పోవాలి.

కౌలుదార్ల ఖబ్జాహక్కు (జిరాయితీ హక్కు) అంగీకరించి న్యాయమైన కౌళ్లు వసూలు చేయాలి.

అక్రమంగా, అన్యాయంగా ఆక్రమింపబడిన భూములను తిరిగి రైతులకిచ్చివేయాలె వీటికి సంబంధించిన అభిప్రాయభేదాలను నిష్పక్షపాతమైన కమిటీద్వారా పరిష్కరించుకోవాలి.

ప్రజలకు కంట్రోలు రేటుపైన ధాన్యం అందించాలి. ఇవి ప్రజల కనీసకోర్కెలు.

మీరు పల్లెప్రాంతాల్లో ప్రభుత్వయంత్రాన్ని బాధ్యతవహించినడుపుతున్నారు. నేటి చారిత్రక సంఘటనలయందు మీరు ఈ నిరంకుశ ప్రభుత్వానికి సహాయపడటమంటే ప్రజా స్వాతంత్ర్యసమరానికి ద్రోహం చేయటమన్నమాట. కాబట్టి మీరు మీ ఉద్యోగాలకు వెంటనే రాజీనామాలిచ్చి సర్వవిధాలా నేటి ఈ ప్రజాపోరాటంలో పాల్గొనవలెనని ప్రార్థిస్తున్నాము. ప్రజలు కోరేదికూడా ఇదే: మనము, ప్రజాబలంతో తప్పక బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధింపగలము. బాధ్యతాయుత ప్రభుత్వం తర్వాత పరిపాలించే ప్రజాప్రతినిధులు, మీరు పరిత్యజించిన ఉద్యోగాలను తప్పక మీకు తిరిగి ఇచ్చివేయగలరు. దానికై కమ్యూనిస్టుపార్టీ - ఆంధ్రమహాసభ సర్వవిధాలా ప్రయత్నించగలదని హామీ ఇస్తున్నాం.













Edited. Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press. No. 7. Thambu Chetty Street. G. T. Madras